This book is a free translation into Telugu of INDIA OUR ALLY? by Honourable D. N. Pritt K.C., M.P. Though the book was written in 1942 it speaks of the relative strength of the political parties in India, which would be of immense to use the Andhra reader, who has to exercise his franchise in the coming elections. We heartily thank Hon. D. N. Pritt for granting us permission to bring out the book in Telugu.

*10—1—45.* Publishers.



# ర చ యి త

డి. యస్. ప్రిట్ 1887 లో జన్మించారు. ఇంగ్లండు, జర్మనీ, స్పెయిన్, స్విట్జర్లాండు దేశాల్లో విద్య నభ్యసించారు. 1909 లో న్యాయవాదిగా జీవితాన్నారంభించారు. పార్లమెంటులో శ్రామికుల తరఫున్న సభ్యుడుగా వున్నారు. సోవియట్ సంయుక్త రాష్ట్రింతో మైత్రి సమకూర్చను ఇంగ్లండులో నేర్పడిన సంస్కృతి సంబంధాల సంఘానికి అధ్యక్షులు. 1933 సెప్టెంబరులో లండన్ నగరంలో జరిగిన 'రెయిక్ స్టాగ్' దహనవిచారణలకు అధ్యక్షులు గూడానూ. 1938 లో రష్యాకు వెళ్ళివచ్చారు. 1936 లో మాస్కో విచారణలప్పుడు అచ్చటనుండి తమ అనుభవాలను చిన్న పుస్తకంగా—'జినోవైవ్ విచారణ'—ప్రచురించారు. కుటుంబజీవి. వీరికి ఒక కుమారుడును, నొక కుమార్తెయు గలరు. వీరి యితర రచనలు—'మాస్కో పై వెలుతురు,' 'ఈ యుద్ధం వ్యాపించాలె?' 'ఫెడరల్ అపోహ,' 'ఫ్రెంచి ప్రజాస్వామ్యపతనం,' 'సోవియట్ సంయుక్త రాష్ట్రం-మన మిత్రరాజ్యం' అనునవి. వీనిలో కడపటి రెండింటిని సంస్కృతి గ్రంథమండలివారు అనుసరించి, క్లుప్తముగా ఆంధ్రమున వ్రాయించి, వారి రెండవ, ఎనిమిదవ ప్రచురణలుగా ప్రచురించియున్నారు.

# ఇండియా
## స్వాతంత్ర్య సమస్య

రచన:

డి. యన్. ప్రిట్ కె. సి., ఎం. పి.,

అనువాదం:

శశి

సంస్కృతి గ్రంథమండలి

వంగల్ బిల్డింగ్స్ :: పెరంబూరు పోస్టు

మదరాస్

ప్రచురణ—19

ప్రథమ ముద్రణ

వెల ఎనిమిదణాలు

1946

సంపాదకులు :

పోచిరాజు రామారావు

కస్తూరి సూర్యప్రకాశరావు

కొత్తపల్లి సుబ్బరామయ్య

మేనేజరు :

వంగల్ గోవిందస్వామి రెడ్డి

# మా మాట

ఈ చిన్న పొత్తం 1942 ఏప్రిల్‌లో బ్రిటిష్ ప్రజల నుద్దేశించి వ్రాయబడినది. గడచిన ఈ నాలుగేండ్లలో మన రాజకీయాలెంతో మార్పుచెందినవి. కాని ప్రతిష్టంభన పరిష్కరింపబడలేదు. ప్రిట్ గారు నాలుగేండ్లనాడు మన రాజకీయ కక్షలను గురించి ప్రకటించిన అభిప్రాయాలను మన ప్రజలు తెలుసికొనడం అవసరమన్న ఉద్దేశంతో ఈ పుస్తకాన్ని ప్రచురిస్తున్నాము.

అడుగగానే అనువాదానికి అనుమతినిచ్చిన రచయితకెంతయు కృతజ్ఞులం. బ్రిటిష్ పార్లమెంటు సభ్యులలో భారత సమస్యపై నెక్కువ ఆసక్తి, అభిమానముగల సభ్యులు చాల తక్కువ. అట్టివారిలో ముఖ్యులు ప్రిట్ గారు. న్యాయవాది యగుటయేగాక సామ్రాజ్యవాద పైశాచమునకు బలియైన ఆసియా, ఆఫ్రికా దేశములకు మిత్రులు, సానుభూతిపరులు. విజ్ఞులగుట వీరి రచనలలో విశిష్టత, ప్రత్యేకతగలవు.

జనవరి, 10, 1946, సంపాదకులు.

# పీఠిక

29–3–1942 న బ్రిటిష్ ప్రభుత్వం క్రిప్సు రాయబారంగురించి ప్రకటించినది. ఈ పుస్తకం అంతకు పూర్వమే వ్రాయబడినది. క్రిప్సు రాయబారమునుగురించి ప్రకటింపబడినప్పుడు ఈ పుస్తకం ముద్రణలో నున్నది. అయినప్పటికీ పుస్తకంలో మార్పులు చేయక మొదట వ్రాసినది వ్రాసినట్లే ముద్రింపించినాను. బ్రిటిష్ ప్రభుత్వ ప్రకటన 'అనుబంధంగా' కడపట చేర్చబడింది.

ఈ పీఠికలో ప్రభుత్వ ప్రతిపాదనను గురించి విమర్శించడం అవసరం. ఇప్పటి పరిస్థితులలో—క్రిప్సు రాయబారం ఇండియా చేరలేదు—విమర్శించడము క్షేమకరమైన పనిగాదు. ఇప్పట్లో విమర్శకుని బాధ్యత చాలా హెచ్చు. అయినప్పటికీ ఈ సూచనలలోని లోటుపాట్లను గుర్తించకుండా వదలడం యెక్కువ అపాయకరం.

ముందు ఒక లోటును గమనించుదాం. ఈ సూచనలలో తక్షణం తాత్కాలిక జాతీయ ప్రభుత్వం ఏర్పాటు చేయబడుననుమాట ఎచ్చట లేదు. భారతీయులు తమ ప్రభుత్వ నిర్వహణములో తాము బాధ్యతవహించే అవకాశ మేదీ కలిగించబడలేదు. ఫాసీజాన్ని యెదార్కొనివి, మనతోబాటు, భారతీయులు పోరాడవలెనన్న వారి ప్రభుత్వంలో వారికి కొంత నిర్వహణ బాధ్యత ఉండవలెను. ఇది అనివార్యమైన షరతు.

ఈ ప్రతిపాదనలలో నున్న ముఖ్య విషయాలను గమనించుదాం. ఈ ప్రతిపాదనలన్నీ యుద్ధం ముగిసిన తర్వాత అములులోకి వచ్చేవి. యుద్ధం ముగిసినతర్వాత పరిస్థితు లేలా వుంటాయో ఇప్పుడు నిర్ణయిం

చడం కష్టం. యుద్ధానంతరం యీ ప్రతిపాదనలు నిరుపయోగం కావచ్చు. పైగా భారతీయులు తమ భావి రాజ్యాంగ విధానాన్ని తమ యిచ్ఛవచ్చి నట్లు నిర్ణయించుకొనకుండా వారి స్వాతంత్ర్యాన్ని అరికట్టే షరతు ఒకటి ఈ ప్రతిపాదనల్లో కలదు. రాష్ట్రీ శాసనసభలలోని అసెంబ్లీ సభ్యులు ప్రజాపరిషత్తుకు (కాన్‌స్టిట్యుయెంట్ అసెంబ్లీ) సభ్యుల నెన్నుకుంటారు. స్వదేశ సంస్థాన ప్రతినిధులు ఈ ప్రజాపరిషత్తులో పాల్గొంటారు. ఈ ప్రతిపాదన పైకి మహా న్యాయంగా ఉన్నట్లు కనబడుతుంది. గమనించి చూచిన ఇందులోని మోసం, బయట బడగలదు. బ్రిటిష్ ఇండియాలోని ప్రజలలో 100 కి 13 మందికి మాత్రమే ప్రస్తుతం ఎన్నిక హక్కుగలదు. ఈ హక్కుగూడా ప్రజాస్వామ్య పద్ధతుల ననుసరించిచూస్తే నిరుపయోగ మని రూఢి అవుతుంది. శాసన సభలలో ప్రత్యేక కులాలు, మతాలు వారికి ప్రత్యేక ఎన్నిక ఏర్పాట్లు, 1935 నిర్మాణచట్టరీత్యా, జరిగినవి. అందువలన పై 13% ప్రజకుగల ఓటింగ్ హక్కు ఉపయోగం లేకుండా పోతూవుంది. ఈ విధంగా, మితపరుపబడిన ఎన్నిక హక్కుగల రాష్ట్రాలు ఎన్నుకునే ప్రజాపరిషత్సభ్యులతోబాటు స్వదేశ సంస్థానాధీశులు నియమించిన ప్రతినిధులు పాల్గొంటారు. వీరు సంస్థానాల ప్రజా ప్రతి నిధులుకారు. కేవలం నిరంకుశులైన సంస్థానాధీశులచే నియోగింపబడువారే. ఇట్లేర్పడు ప్రజాపరిషత్తు భారతీయుల ప్రతినిధి సంస్థ కాజాలదు. ప్రజల ప్రతినిధి సంస్థ కాదుగనుక ఈ పరిషత్తు దేశ విభజనకు అనవసర ప్రోద్బ లాన్నివ్వవచ్చు. భూగోళరీత్యాగాని, పరిపాలనాదక్షతను బట్టిగాని, ఆర్థికం గాగాని ఇండియా విభజన నెరవేరేపనిగాదు, ఐర్లండులో నాడిన విషాద నాటకాన్నే ఇండియాలో—పెద్దెత్తున— ఆడినవారమౌతాము.

ఫాసీజాన్ని బ్రిటిష్ ప్రజలు. భారతీయులు జయించడం అత్యవ సరం. అందుకీ యుద్ధంలో భారతీయులు పూర్తిగా పాల్గొనాలి. ఆ అవ

కాశాన్ని కల్గించను క్షణం ఆలస్యం లేకుండా భారత జాతీయ ఆశయా లనుగురించి స్థిరమైన రాజీ కుదరాలి. ఈ దేశంలోని (బ్రిటన్) ప్రజా స్వామ్య ప్రజాభిప్రాయానికి గొప్ప అవకాశం ఇప్పుడు లభించింది. మన ప్రజల బాధ్యతగూడా గొప్పదే. బ్రిటిష్ ప్రజాభిప్రాయం తమ ప్రభుత్వంపై ఒత్తిడితెచ్చి ఇంతవరకూ జాతీయ ప్రభుత్వం నిర్మింపబడేట్లు చెయ్యాలి. ఈ ప్రభుత్వ నిర్మాణానికి వీలయ్యేటట్లు క్రిప్సురాయబార సూచనలను బ్రిటిష్ ప్రజలు మార్పించాలి. భారత జాతీయ ప్రభుత్వం ఇండియా పరిపాలనకేగాక బ్రిటన్‌తో ఈ యుద్ధంలో సహకారం చేయడానికిగూడా బాధ్యురాలై యుండాలి. బ్రిటన్‌కు ఇండియా ఏలా సాయపడగలదో ఈ పుస్తకంలో చర్చించాను. మన ప్రభుత్వం ప్రతిపాదనలలో తగు మార్పులు తెచ్చిన ఇప్పుడు బ్రిటిష్ ప్రభుత్వానికి, భారత కాంగ్రెస్‌కు జరుగ నున్న రాయబారాలు తప్పక ఫలింపగలవు. తద్వారా మానవకోటికంతకు లాభమున్నది. బ్రిటిష్ ప్రజలు, బ్రిటిష్ ప్రభుత్వానికి భారత జాతీయ కాంగ్రెస్‌కు సమాధానం కుదర్చడానికి తమ సాయ శక్తుల ప్రయత్నించాలి.

ఏప్రిల్ 2, 1942. డి. యన్. ప్రిట్.

# పరిచయం

భారత జాతీయాశయాల సమాధాన సమస్యను రాజకీయరంగమున ముఖ్యాంశముకు తెచ్చినది ఇండియాను జపాన్ దండెత్తనున్నదన్న భయమే. అందువలననే యుద్ధ మంత్రివర్గ ప్రతిపాదనలతో సర్ స్టాఫర్డ్ క్రిప్స్ ఇండియాకు పంపబడుచున్నారు.

బ్రిటిష్, భారత ప్రజల చరిత్రలో ఈ సంఘటన యొక గొప్ప విషయము కాదగినది. ప్రస్తుత యుద్ధంలో మన మొక క్లిష్టపరిస్థితిలో నున్నాము. మన క్షేమము, మానవ ప్రపంచమంతటి క్షేమము ఫాసీజాన్ని పూర్తిగా నోడించడంలోనున్నది. ఫాసీజం జర్మను నాజీజంకాని, జపాన్ మిలిటరిజంకాని, ఇటలీ ఫాసీజంకాని దానిని పూర్తిగా ధ్వంసం చేయనిది ప్రపంచశాంతి ఏర్పడదు. ఇండియా ప్రజలు, మనవలెనే, ఫాసీజానికి ప్రబల విరోధులు. వారు స్వాతంత్ర్యం కావాలని ధృఢంగా కోరుచున్నారు. ఫాసిస్టు శక్తులనెదిరి మనం చేస్తున్న ఈ ఘోర యుద్ధంలో వారు మన కెంతో సాయపడగలరు. వారికి మనకు సహజమైత్రి ఉండనే వున్నది. కాని వారి జాతీయ స్వాతంత్ర్య సమస్యను తృప్తికరంగా పరిష్కరింప నిది వారి సహకారాన్ని, సహాయతను మనం పొందలేము. రానున్న కొద్ది వారాలలో మనం సక్రమమైన చర్యలను ధైర్యంతో నెరవేర్చడం మీద మన రెండు దేశముల ప్రజల భవిష్యత్తు అధారపడియుండును. మన సంగతికి, మనం ఇండియా ప్రజల సహాయాన్ని పొందుదుమా ? పోగొట్టుకొందుమా ? అన్నవిషయాన్ని రానున్న సంఘటనలు తీర్మానించ గలవు. భారతీయుల సహాయాన్ని మనం పొందగలిగిన ప్రస్తుత యుద్ధం విపరీతంగా—మనకు లాభసాటిగా—మారిపోగలదు. భారతీయుల సంగ

తికి, వారు సౌఖ్యంగా, దినదినాభి వృద్ధిచెందుచూ, స్వతంత్రంగా జీవించ డమా? లేక విదేశీయులు మరెవరైనా (జపాన్‌వారు) ఇండియాను దండెత్తిన తద్వారాకలుగు శృంఖలాలచే బంధింపబడి ఇంకా చాలకాలం వఱకు బానిసత్వమున కృశించడమా? అన్న విషయం తీర్మానింపబడుతుంది.

మూడు కారణాలవల్ల భారత జాతీయ సమస్య తృప్తికరంగా తీర్మానింపబడడం అత్యవసరం. ఈ సమస్యాపరిష్కారంవలన బ్రిటన్ రక్షింపబడుతుంది. ఫాసీజం ఓడింపబడుతుంది. భారతీయులు అభివృద్ధికరమైన జీవిత విధానాన్ని యేర్పరచను పూనుకొనగలరు. ప్రస్తుతం భారతీయుల ఉత్సాహం, తెలివి తేటలన్నీగూడా కేవలం రాజకీయ పోరాటంలోనే వెచ్చింపబడుచున్నవి. అప్పుడు భారతీయులు నిర్మాణ కార్యక్రమానికి పూనుకొనగలుగుదురు. తద్వారా భారతీయులకేగాక మానవకోటి కంతకు అపార లాభం చేకూరగలదు.

ఇట్టి పరిష్కారం కుదురుతుందా? కుదరగలదనే మనం జవాబివ్వాలి. పరిష్కారాన్ని కుదర్చడం సులభమైన పనిగాదు. పరిష్కార సమస్యను వివరించిచూస్తే చాల కష్టసాధ్యమైనదని తేలుచున్నది. పరిష్కారం కుదరకుండా నిరోధించడానికి అనేక బలవంతమైన శక్తులు ప్రయత్నించుతవి. కొన్నేండ్లపాటుగా నాటుకుపోయిన అనుమానం, అపార్థం, విరోధాలు కారణంగా నేర్పడిన అడ్డంకులు—వీటిలో కొన్ని కేవలం ఊహామాత్రమే అయినా—అన్నింటిని దాటి మనం ముందుకు సాగాలి. భారతీయ సమస్యలో మనం పరిష్కరింపజాలని విషయమేదీ లేదు. భారతీయులు, మనము (బ్రిటిష్‌వారు) సుహృద్భావంతో ప్రతిష్టంబనను పరిష్కరింపగలిగిన తద్వారా యేర్పడే సత్ఫలితాలు మన ఉభయులకేగాక మానవజాతికంతకూ లాభదాయకంగా నుండగలవు.

ఈ సంప్రదింపులు సాగుచున్నప్పుడు వీటిని అనేక శక్తులు ఆక్షే

పించడం సహజం. ఇట్టి ఆక్షేపణలు ఇండియాలోనూ, మన దేశంలోనూ గూడా బయలుదేరగలవు. అట్టితరుణంలో బ్రిటిష్ కార్మిక వర్గానికిచెందిన మనం నిర్వహించవలసిన బాధ్యత చాలావున్నది. మనం ప్రజాస్వామ్య ప్రభుత్వాన్ని గలిగియున్నాము, మనదేశం ప్రజాస్వామ్య దేశం. మన దేశపు రాజకీయాలన్నిటిని, అన్ని సమస్యలవలెనే, మనమే పరిష్కరించాలి, ఇదె మన బాధ్యత, ఇట్టి బాధ్యతను మన ప్రభుత్వానికి సమర్పించి మనం చేతులు ముడుచుకొని కూర్చోరాదు. ఇంతదనుక భారత సమస్య పట్ల మనం చూపిన విముఖత నిప్పుడు మానవలెను. ఈ నిర్లక్ష్యభావం అంత్యంత అపాయకరమైనది. మన విముఖత కొంతవరకు ఇటీవల మిలిటరీ సంఘటనలవలన తగ్గుచునే వచ్చుచున్నది. పూర్వపు దురభిప్రాయాలనే అంధకారాన్ని భేదించుకొని ప్రజల దృష్టి సత్యాన్నేచూడాలి. కొత్తగా ఈ యుద్ధకాలంలో నేర్పడిన సెన్సార్‌షిప్ అను పొగ మంచు గుండాకూడా ప్రజలు చూడగలగాలి. మనకు లభించే సత్యమైన వార్తలను బట్టి భారత సమస్యనుగురించి స్వతంత్రాభిప్రాయాన్ని మనం కలిగివుండాలి. భారత సమస్యనుగురించి మనం రూఢిగా తెలుసుకుంటేగాని ఎట్టి తీర్మానానికి రాలేము. మన ప్రభుత్వం స్వలాభాపేక్షగల అనేక శక్తుల ఒత్తడికి లొంగుతుంది. మన ప్రభుత్వ ప్రతిపాదనలు అంత శ్రేష్ఠమైనవిగాక పోవచ్చు. భారతీయుల ప్రతినిధుల ఆశయాలు కొంత పొరబాటైనవి గావచ్చు. భారత ప్రతినిధులు ఒక్కొక్కప్పుడు ప్రత్యేకవర్గాల ఒత్తిడికి ఎడమివ్వవలసి యుంటుంది. మన ప్రభుత్వ ప్రతిపాదనలు, భారతీయ ప్రజానాయకుల కోరికలు—ఈ రెంటిలో నేది ? ఎంతవరకు ? సమంజస మని మనం తెలిసికోగలిగి యుండాలి.

భారత దేశాన్నిగురించి నిజం తెలుసుకోడానికి ఉపకరించు తుందనే వుద్దేశంతోనే యీ పుస్తకం వ్రాయబడినది. ప్రజాభిప్రాయాన్ని

చక్కదిద్దుటే ఈ రచనయొక్క ముఖ్యోద్దేశం. భారతదేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యం త్వరలోనే సిద్ధించబోవుచున్నది. ఇందుకు అనేక కారణా లున్నవి. అందువలన స్వాతంత్ర్యం ఏలా స్థాపింపబడడమా అని నేడే ——రేపు కాదుసుమా——తీర్మానింపబడాలి. బ్రిటిష్ ప్రజలు అయిష్టతతో గాక ఈ తీర్మానాన్ని సహస్ఫూర్తిగా చేయాలి. మన ప్రభుత్వం ఇంత దనుక "అకాలంలో——స్వల్ప" సంస్కరణలు చేయడంవలన స్వాతంత్ర్య పథకం, భీతమనస్కులు సంతృప్తి చెందినారు గాని భారతీయులు తృప్తి చెందలేదు. అందువలననే ఇంక ప్రజాబాహుళ్యం మన సంస్కరణలను బలపరచలేము, ఇప్పటి పరిస్థితులలో పూర్వంలాగా సంస్కరణాలంటూ నాటక మాడడం అతి ప్రమాదకరం,



క్రిప్సు రాయబారాన్ని బ్రిటన్ ఇండియా పంపుచున్నందుకు మనం హర్షిస్తున్నాం. క్రిప్సురాయబార ప్రతిపాదనలలో కొన్ని లోటుపాట్లున్న మాట నిజమే. ఈ ప్రతిపాదనలు పార్లమెంటులో చర్చింపబడనున్న వన్నారు. ప్రజాస్వామ్యదృష్టితో చూస్తే ఇది మంచి విషయమే. కాని ఈ సూచనలేవీ ఇంతవఱకు ప్రకటింపబడక పోవడం విచారకరమైన విషయం. ఈ యుద్ధకాలంలోని మన అనుభవాన్నిబట్టిచూస్తే ప్రభుత్వాలకన్నా ప్రజలే

ప్రతి విషయంలోనూ, మిన్నగానున్నట్లు కనబడుతుంది. క్రిప్స్ రాయబారం వెంటనే ఇండియాకు వెళ్ళి తన కార్యక్రమాన్ని ప్రారంభించకుండా కొంత అనవసర ఆలస్యం జరుగుచున్నది. యుద్ధ పరిస్థితులనుబట్టి యోచిస్తే ఈ ఆలస్యం అతి ప్రమాదకరం. పైగా 11-3-1942 న విన్స్టన్ చర్చిల్ (యుద్ధకాలపు బ్రిటిష్ ప్రధాని) ఒక ప్రకటన చేశారు. ఈ ప్రకటనలో "భారత సమస్యా పరిష్కారానికి గల అడ్డంకులు—లక్షణాలు" అన్న విషయంపై ఆయన నొక్కి వక్కాణించాడు. ఈ ప్రకటనలో చర్చిల్ తన చుట్టూవున్న అభివృద్ధి విరోధకుల తత్వాన్ని వెలిబుచ్చడమేగాక, మునుపు తనకు భారత స్వాతంత్ర్యంపట్లగల విరోధభావం చావలేదని ఋజువుచేశారు. ఇన్ని అడ్డదిడ్డాలున్నా క్రిప్స్ రాయబారాన్ని మనం యిప్పుడు ఇండియాకంపడం, చాలకాలంగా అగుపడని, శుభసూచకమే. ఈ రాయబారం పంపబడుచున్నందుకు మరోవిధంగాగూడా మనంసంతోషపడాలి. ఈ రాయబారాన్ని పంపుచున్నది "యుద్ధ మంత్రివర్గం" (వార్ కాబినెట్) ఈ మంత్రివర్గంలో భారతీయ సమస్యపట్ల ఇంచుకైనా సానుభూతిలేనివారు అనేకమంది వున్నారు. అట్లీ, సర్ జాన్ అండర్సన్, చర్చిల్ మొదలైనవారు నేడు యుద్ధ మంత్రివర్గంలో సభ్యులు. భారత ప్రజల ఆశలు భగ్నంకావని మనం ఆశించడానికి కొంత అవకాశం ఇప్పటికి దొరికింది.

# 1. నూతన మార్గం

నేటి క్లిష్టపరిస్థితులలో మనమొక కొత్త మార్గాన్ని, నూతన ఉత్సాహాన్ని సూచింపవలసిన అవసరం వున్నదని గుర్తించాలి.

మానవ సంతతిలో ఆరింట నొకపాలు ఇండియాలో నున్నారు. బ్రిటిష్ సామ్రాజ్యంలోని ప్రజలందరిలో ఐదింట నాలుగుపాళ్ళు ఇండియాలోనే ఉన్నారు. ఇండియా యిప్పటికి దాదాపు 180 యేండ్లుగా బ్రిటిష్ సామ్రాజ్యంలో నొక భాగంగా నున్నది. గడచిన 60 యేండ్లుగా ఇండియా స్వపరిపాలనను కోరుతూవున్నది. క్రమేణా ఈ కోరిక బలపడుచునేయున్నది. ప్రస్తుతం ఈ కోరిక విస్పష్టంగా స్వాతంత్ర్యానికి మారింది. గడచిన 60 యేండ్లలో ఈ కోరికకు ప్రజాపరణగూడా క్రమేణా హెచ్చింది. ఈనాడు ఇండియాలో ప్రతివ్యక్తి ''ఇక ఇండియా పరపరిపాలనక్రింద నుండజాలదు'' అని గ్రహించాడు.

ఈ స్వాతంత్ర్యకాంక్ష దినదినాభి వృద్ధిచెందుతూవుంటే బ్రిటిష్ ప్రభుత్వం దృష్టి యేలాగున్నది ? పరిస్థితుల మార్పు ననుసరించి కొంత బ్రిటిష్ ప్రభుత్వం దృష్టిగూడా మారింది. కాని, భారత జాతీయవాదులు బ్రిటిష్ ప్రభుత్వంమీద ఆరోపించిన నేరాలన్నీ చాలవరకు నిజమనే అనాలి. అనేకమార్లు స్వాతంత్ర్యోద్యమం విజృంభించినప్పుడు—బ్రిటన్ శక్తి తగ్గుతున్నట్లు అగుపడినప్పుడు—తుపాకి కాల్పులతో, లక్షలాది కాంగ్రెస్‌వాదుల అరెస్టులతో స్వాతంత్ర్యోద్యమాన్ని ప్రభుత్వం అణచివేసింది. నేటికీ (1942) భారతీయులు వేనవేలు ఖైదులోనున్నారు. వీరు చేసిన నేరం స్వాతంత్ర్యాన్ని కోరడమే. సాధారణ ప్రజాస్వామ్యదేశాలలో నయితే వీరిని నేరస్థులుగా పాటించనే పాటించరు. కొన్ని సందర్భాలలో

బ్రిటను సంస్కరణనలన్న పేరుతో తన అడుగులకు మడుగులొత్తు భార తీయులను ప్రభుత్వంలోనికి చేర్చుకొనుచున్నది. కాని, అధికారాన్ని భార తీయులపరం గాకుండానే చూస్తూవున్నది. ఈ బులిబూచి మార్పులవలన భారతీయుల స్వాతంత్ర్యతృష్ణ ఆరుతుందా? స్వాతంత్ర్యవాంఛ బ్రిటిష్ ప్రభుత్వం అణగద్రొక్కలేనంత బలయుతంగా నున్నప్పుడు "ఇండి యాకు 'అధినివేశప్రతిపత్తి' నిస్తాం" అంటూ దప్పుకొంటుంది బ్రిటిష్ ప్రభుత్వం. ఇప్పటికి కనీసం 25 యేండ్లుగా "ఇండియాకు అధినివేశప్రతి పత్తి" అని వింటున్నామేగాని, దానినైనా బ్రిటిష్ ప్రభుత్వం అనుభవంలో అవగింజంతయినా చూపినట్లు లేదు.

గడచిన 180 యేండ్లుగా ఇండియా ఆర్థిక విధానం—గ్రామ జీవన మేమి, పట్టణవాసమేమి—బ్రిటిష్‌వారి ఆదాయంకోసమే నడపబడుతూ వుందని భారతీయుల ఆరోపణ, ఈ ఆరోపణ సత్యమనే అనాలి. ఇండి యాలో పెట్టుబడి పెట్టిన బ్రిటిష్ మూలధనాన్ని బ్రిటిష్ ప్రభుత్వం భద్రంగా కాపాడుచున్నది. బ్రిటిష్ పరిశ్రమలు ఉత్పత్తి చేస్తూన్న అపార వస్తుసామగ్రిని, పై పోటీ లేకుండా, హెచ్చు ధరలకు ఇండియాలో అమ్మి లాభాలుదోచుకునే అవకాశాన్ని బ్రిటిష్ ప్రభుత్వం కల్గించుచున్నది. భారతీయుల యోగక్షేమాలను బ్రిటిష్ ప్రభుత్వం పాటించడమే లేదు. భారత పరిశ్రమలు అభివృద్ధిజెందిన బ్రిటిష్ యెగుమతులు తగ్గునను భయమున భారత పారిశ్రామికాభివృద్ధిని బ్రిటిష్ ప్రభుత్వం అరికట్టుచున్నది. ఇండి యాలో హెచ్చుజనం—100 కి 75 పాళ్ళు—తమ జీవనోపాధికి వ్యవ సాయంపైద ఆధారపడియున్నారు. పరిశ్రమలు వ్యవసాయపరిమితికి అభి వృద్ధిజెందినగాని ప్రజలు కొద్ది సౌఖ్యమునైనా పొందగలుగరు. బ్రిటిష్ ప్రభుత్వం పారిశ్రామికాభివృద్ధి నరికట్టి భారతీయులు తమకైనందిన జీవితావసరాల కన్నిటికి బ్రిటిష్ పరిశ్రమోత్పత్తిపై నాధారపడునట్లు

చేయుచున్నది. ఆర్థికంగా భారతదేశమంతాగూడా ఈనాడు బ్రిటన్‌కు బానిస దేశమైయున్నది. నేటివరకు ఇండియాలో మోటారు బండ్లను, విమానాలను తయారుచేయడానికి అవసరమైన కంబషన్ ఇంజనులు తయారుచేయబడకుండా బ్రిటిష్ ప్రభుత్వం అడ్డుపడుచున్నది. భార పరిశ్రమల కవసరమైన అన్ని రకాల ముడిసరకులు ఇండియాలో దొరకుచున్నవి. కాని ఇండియాలోని పరిశ్రమలలో ఈనాడు పాల్గొనే భారతీయులసంఖ్య 100 కి 1½ కి తక్కువగానున్నది. అందువలననే భారత దేశంలో అవిద్య, పేదరికం అపారముగా నున్నవి. ఈ శతాబ్దారంభం నుంచి భారతీయుల దారిద్ర్యం, నిరక్షరాస్యత హెచ్చుతునే వున్నవిగాని తగ్గడంలేదు. ఈ నాడు భారతీయుని సగటు ఆదాయం రోజు 1 కి రెండణాలు మాత్రమే. భారతీయులలో నూటికి 88 మంది నేడు నిరక్షరాస్యులుగానున్నారు. సోవియట్ సంయుక్తరాష్ట్రం గడచిన పాతికేండ్లలో సాధించిన మహత్కార్యాలనుజూచి భారతీయులు తమ దారిద్ర్యానికి, అవిద్యకు కారణం పర పరిపాలనయే అని భావించడంలో ఆశ్చర్యమేమున్నది? పాతికేండ్లక్రితం రష్యా, ఇండియాలాగా, అష్ట దరిద్రం, అవిద్యలలో మునిగి తేలుతూవుండేది. సోవియట్ సంయుక్త రాష్ట్రానికి చెందిన ఆసియా ప్రజలు కొందరికి, భారతీయులకు సంస్కృతిలోనూ, స్వభావంలోనూ, గుణగణాల్లోనూ చాలా పోలికలున్నాయి. పాతికేండ్లక్రితం నేటి సోవియట్ సంయుక్త రాష్ట్రంలోని ఆసియా దేశాలుకొన్ని, నేటి ఇండియావలెనే, ఒక యూరోపియన్ దేశానికి (రష్యాకు) వలస రాజ్యాలుగా నుండేవి. గడచిన పాతిక సంవత్సరాలలో ఇండియా, మునుపటివలెనే, ఇంగ్లండుకు వలసరాజ్యంగా ఉండిపోయింది. కాని పాతికేండ్లక్రితం రష్యా వలస రాజ్యాలుగానున్న కొన్ని ఆసియాదేశాలు (తుర్కమేనియా, ఖిర్గీజియా మొదలైనవి) ఈనాడు వలస రాజ్యాలుగా లేవు సరిగదా,

స్వతంత్ర రాజ్యాలై, ఒక సంయుక్త రాష్ట్రంలో స్వతంత్ర భాగస్వాము లుగ సమాన ప్రతిపత్తిని జీవించుచున్నవి. ఆదేశాలలో యీ గడచిన పాతికేండ్లలో జరిగినమార్పులు అపారం. ఆదేశాల ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక, రాజకీయ జీవనంలో ఎంతోమార్పు కలిగింది. ఆ మార్పును గుర్తించిన భారతీయులు మరి బ్రిటిష్ సామ్రాజ్యపాలన కంగీకరిస్తారా ?

పై కారణా లన్నిటివలన ఇండియాలోని స్వాతంత్ర్యోద్యమం క్రమేణా అభివృద్ధి చెందుతునేయున్నది. ఈ ఉద్యమం ఆర్థిక, రాజకీయ సమస్యలన్ని పునాదులపై నిర్మింపబడియున్నది. కొన్నియేండ్లక్రితమైన యే కొద్దిపాటి సంస్కరణాలతోనో, యే అధినివేశ ప్రతిపత్తితోనో భారతీయులు తృప్తిపడేవారేమో ? కాని యీనాడు అర్థమనస్సుతో బ్రిటిష్ ప్రభుత్వం సూచించే సంస్కరణాలకు భారతీయులు అంగీకరించరు. బ్రిటిష్ పరిపాలన చెడ్డదని, బ్రిటిష్ పరిపాలనా ఫలితాలు ఇండియాకు కీడు చేసినవని భారతీయులు అన్నివిధాల ఋజువు చేయగలరు. అందువలన భారతీయుల స్వాతంత్ర్య హక్కు ధృఢపడినట్లే.

జాతీయ చైనా నాయకుడు జనరలిస్సిమో ఛెయాంగ్‌కైషేక్ యీ మధ్య ఇండియాకువచ్చారు. ఆయనగూడా భారతీయులకు స్వాతంత్ర్య హక్కు సంపూర్ణంగా నున్నదని గుర్తించారు. ఇండియాలో తన పర్యటన ముగియగానే 21-2-1942 న భారతీయులకొక సందేశా న్నిచ్చారు. ఆ సందేశంలో దురాక్రమణి నెదిరి భారతీయులు ఈ యుద్ధంలో సంపూర్ణంగా పాల్గొనవలెనని చెప్పి, తర్వాత ఈలా అన్నారు—

"మా (చైనాకు) మిత్రరాజ్యం గ్రేట్ బ్రిటన్ భారతీయుల వాత్తిడికై వేచి యుండకుండా, తానే స్వయంగా, వీలైన త్వరలో రాజకీయాధికారాన్ని చాలవరకు భారతీయులపరం చేయాలి. అప్పుడుగాని తమ భౌతిక, నైతిక బలాన్ని భారతీయులు పెంపొందించుకొనడానికి వారికి సదవకాశముండదు.

వారిబలం పెంపొందినప్పుడు యీ యుద్ధంలో పాల్గొనడం కేవలం బ్రిటనుకు సాయపడడం మాత్రమే గాదని, తమ స్వాతంత్ర్య సమరంలోగూడా గొప్ప మార్పుకలిగినట్లేనని వారు గుర్తించగలుగుదురు. అధికారాన్ని భారతీయులపరం చేయడం బ్రిటిష్ సామ్రాజ్య గౌరవానికి బలం. ఇంతటి వుత్తమోత్తమ మార్గం వేరొకటిలేదు. ఈ పనిని బ్రిటన్ యిప్పుడు నిర్వహించిన చాల తెలివైనపని చేసిందని అనక తప్పదు."

# 2. ఇండియా ఒక జాతియే

ఏవో తమ కష్టాలను నిష్ఠూరాలను నివారింపమని కోరకుండా తమ దేశ స్వాతంత్ర్యాన్ని, తమజాతి స్వాతంత్ర్యాన్ని కోరే ప్రజలు వొకజాతికి చెందినవారే అగుదురు. వారిలో కొంత ఐక్యత, సమదృష్టి, ఐకమత్యం, జాతీయభావం విదితమౌతవి. భారతస్వాతంత్ర్యానికి విరోధులైనవారు ఇండియా ఒకజాతికాదని అంటారు. వారి వాదన యిలా వుంటుంది—ఇండియాలో అనేక తెగల (రేసెస్) ప్రజలున్నారు. ఇండియాలో ప్రజలు అనేక మతాలను అనుసరిస్తున్నారు. మహమ్మదీయులు, అస్పృశ్యులు మొదలైన కోట్లకొలది భిన్నమతావలంబకులైన అల్పసంఖ్యాకులున్నారు. ఇండియాలో మత కలహాలు సర్వసామాన్యం. అందువలన ఇండియా వొకజాతి (నేషన్) కాదు.

పై వాదనలోని అంశాలు నిజమైతే బ్రిటిష్ ప్రభుత్వం ఇండియాకు అధినివేశ ప్రతిపత్తి నిస్తానన్న వాగ్దానం మాటయేమిటి? ఇండియా ఒక జాతికానప్పుడు బ్రిటన్ ఇండియాకు అధినివేశ ప్రతిపత్తిని మాత్రం యెలా యివ్వగలుగుతుంది? అంటే బ్రిటన్ చేసిన వాగ్దానాలన్నీ బూటకాలన్న మాట? ఇండియా వొకజాతికాదన్న పై కారణాలలో యిసుమంతైనా

సత్యంలేదు. భారతీయులు యేతెగకు చెందినవారైనా, యేమతానికి చెందిన వారైనా, యేభాషను మాట్లాడేవారైనా చాలకాలంగా జాతీయ ఐక్యతా భావాన్ని కలిగియున్నారని ప్రపంచం గుర్తించినది. జాతీయ ఐక్యత, జాతీయ ఆశయం యేర్పడియున్నందున ఇండియా ఒక జాతియని మన మంగీకరింపక తప్పదు. విన్సెంట్ స్మిత్ వ్రాసిన "ఆక్స్‌ఫర్డ్ ఇండియా చరిత్ర" (1919) లోని కొన్ని వాక్యాలను మనం పురస్కరించుకొనిన ఇండియా ఒక జాతియని స్పష్టపడగలదు—

> "చరిత్రలో నెన్నడు ఇండియాలో రాజకీయ ఐక్యత పరిపూర్ణంగా యేర్పడి యుండలేదు. కాని శతాబ్దాల పర్యంతం ఇండియా ప్రజలందరి ఆశయం యీ రాజకీయ ఐక్యతయే. ఇండియాకంతటికి (ఇండియాకేమిటి ఆనాటి ప్రపంచమంతటికి కూడా) ఒక్కడే పరిపాలకుడన్న భావం సంస్కృత వాఙ్మయంలో "చక్రవర్తి" అన్న పదంలో విస్పష్టంగా ప్రకటింపబడినది. అనేక శిలాశాసనాలలోగూడా యీ భావం విదితమైయున్నది. మహా భారతంలో కురుక్షేత్ర యుద్ధకథనంలో భారతదేశంలోని జాతులన్నీ—దక్షిణపు కొసనుంచీగూడా—కురుక్షేత్ర యుద్ధంలో సమీకరింపబడినవని చెప్పబడి యున్నది. దీనినిబట్టి ఆనాడే (క్రీ॥ పూ॥ 1000 సంవత్సరములకుముందే) భారతప్రజలందరి ఆశయం, ఆసక్తి వొకటిగా నుండెనని ఋజువగు చున్నది. ఇండియానుగురించి వ్రాసే ఐరోపియన్ రచయితలు సాధా రణంగా ఇండియాలోని అనైక్యతనే గుర్తిస్తారు. ఐక్యతను గుర్తింపలేరు. కాని ఐరోపియన్ రచయితలలో అసాధారణ ప్రజ్ఞాశాలి ఒక్క జోసఫ్ కనింగ్‌హామ్ మాత్రమే. ఇతడు అతి స్వతంత్ర రచయిత. 1845 లో బ్రిటిష్‌వారు తమను దండెత్తుదురన్న సిక్కుల భయాన్నిగురించి యితడు వర్ణించాడు. ఈ సందర్భంలో ఒక నూతన సత్యాన్ని యితడు వెల్లడించాడు—"కాబూల్ మొదలు అస్సాంవరకును, హిమాలయములు మొదలు లంక వరకును హిందూస్థాన్ వొకటే దేశంగా పరిగణింపబడుచున్నది. ఈ హిందూస్థానంలో యేచోటనైనా వొకరాజ్యాధిపత్యం కొత్తగా యేర్ప

డిన ఆ అధిపత్యం దేశానికంతకు కంటకమౌతుందని ప్రజలు విశ్వసించే వారు." అందువలన భారతదేశం యిప్పటికి మూడువేల సంవత్సరాలకు పైగా ఆదర్శ రాజకీయ ఐక్యతను కలిగియుండినది—సదా కలిగియే యున్నది.

"రాజకీయాధిపత్యం, భూగోళరీత్యా ప్రత్యేకత వీటి రెంటికన్నా ప్రాధాన్య మైన ఐక్యతను ఇండియా కలిగియున్నది. ఈ ఐక్యత అతి ప్రాధాన్య మైనది. ఈ ఐక్యత ప్రత్యేక తెగ, రంగు, భాష, అలవాట్లు, ఆచారాలు— అన్నిటిని అధిగమించి, అంతర్వాహినివలె పైకగుపడకయున్నను, ప్రవ హించుచున్నది."

ముస్లింలీగ్, దాని నాయకుడు జిన్నాగారూ యిటీవల "పాకిస్థాన్" తమ ఆశయమని ప్రకటించారు. "పాకిస్థాన్" అంటే ముస్లింలు అధిక సంఖ్యాకులుగ నున్న రాష్ట్రాలు ఇండియానుంచి విడివడి స్వతంత్ర రాజ్యం కావాలని అర్థం. ఈ "పాకిస్థాన్" కోర్కె "ఇండియా ఒక జాతి" అన్న సత్యాన్ని ధిక్కరిస్తుంది, ముస్లింలీగ్‌వారు ఇండియాలో రెండు జాతులు —హిందువులు, ముస్లింలు—ఉన్నవనే అంటున్నారు. కాని, ముస్లిం లీగ్‌కూడా జాతీయవాదులతోబాటు బ్రిటిష్ పరిపాలననుండి స్వాతంత్ర్యాన్నే కోరుచున్నది.

ముస్లింలీగ్ బలాబలాలు తర్వాత చర్చించుదాం. ముస్లింలీగ్ వాదనకు, ఇండియాలో బ్రిటిష్‌పాలన ఆ చంద్రార్కం సాగాలనేవారి వాదనకు చాల సన్నిహిత బాంధవ్యమున్నది. బ్రిటిష్‌పరిపాలన ఇండియాకు తప్పదనేవారుకూడా—ముస్లింలీగ్‌వలెనే — హిందువులకు ముస్లింలకు అనివార్యమైన వైషమ్యమున్నదని, ఆద్వేషాన్ని మాన్పడం వీలు కాదని అంటారు. ఈ వైషమ్యాన్ని బ్రిటిష్ పరిపాలకులే తమపాలన సాగడానికి పెంపొందించారని భారత జాతీయవాదులు, తగుమైన ఆధారా లతో, అంటున్నారు. ఇండియాలోని స్వదేశ సంస్థానాలలోనూ, బ్రిటిష్

ఇండియాలోని కార్మిక సంఘాలలోనూ, కార్మికోద్యమమందును చాల కాలంగా ముస్లింలు—హిందువులు సోదరభావంతో కలసిమెలసి పని చేయుచున్నమాట వాస్తవమే. జాతీయతను భగ్నపఱచవలసినంత వైషమ్యం వీరిమధ్య లేదు. పైగా జాతీయోద్యమ బలాన్ని గమనించా మంటే హిందువులు—ముస్లింలమధ్య యిట్టి ప్రధాన వ్యత్యాస మున్నట్లు కనబడదు. అట్టి ప్రధాన వ్యత్యాసముండియున్న హిందువులు—ముస్లింలు ఇన్నేండ్లు కలసి స్వాతంత్ర్యంకొఱకు పోరాడియుండరు. "పాకిస్థాన్" కోరిక యెన్ని యేండ్లక్రితమో బయలుదేరియుండేది. ఇప్పటికెంతో బల పడియుండేదికూడాను. ప్రత్యేక మతాలకు, అల్ప సంఖ్యాకులకు, యితర ఆసక్తులకు రక్షణల నేర్పాటుచేయడం అవసరం. కాని వాటి పరిమితిని మించి జాతీయాశయాలకు అడ్డుపడువఱకు వాటిని పెరుగనివ్వరాదు.

జాతీయ స్వాతంత్ర్యాన్ని నిరోధించను సాధారణంగా మఱొకవాదన యున్నది. ఇండియాలో భాషలు అనేకమున్నవన్నవాదన యిది. మొదలే అనేక వ్యత్యాస భాషలున్నప్పుడు అదేశానికిచెందని మన భాషను (ఆంగ్ల మును)భారతీయులలో 100 కి ఒకడు చదివేట్లు, వ్రాసేట్లు వొత్తిడి తెస్తున్నాం. మన భాషావ్యాప్తిని ఇండియానుంచి ఉపసంహరించుకొనిన భారతీయ భాషలకు నష్టమేమీ రాదు. బాషలనేకమున్నా పైన వివరింప బడిన ఐక్యజాతీయతకు యేవిధమైన భంగం కలుగదు. ఈ భాషానమన్య జాతీయభావాన్ని యింతవరకూ మాన్పలేదు—మాపలేదుకూడా. నిజంలో ఇండియాలో ముఖ్య భాషలు పంద్రెండుమాత్రమే ఉన్నవి. ఇందులో తొమ్మిది పరస్పరం చాలా దగ్గరి సంబంధంకలవి. హిందూస్థాని యిప్పటి కప్పుడే దేశ భాషగా మారుతూవున్నది.

ఇండియాలో జాతీయభావం దినదినాభివృద్ధి చెందడానికి దేశంలోని ఆర్థిక పరిస్థితులు, రాజకీయ ప్రతిష్టంబన మాత్రమే కారణాలుకావు. భారత

జాతీయచైతన్యం ఆశియా ప్రజల చైతన్యంలో ఒక అంశంమాత్రమే. ఈ నాడు ఆశియా అంతట యీ జాతీయచైతన్యం విస్పష్టంగా అగుపడుచునే యున్నది. నేడు యిట్టి చైతన్యం చైనాలోనూ, టర్కీలోనూ, సోవియట్ యూనియన్‌కు చెందిన ఆసియా రాజ్యాలలోనూ చూడనగును. (ఇది 1942 మాట. నేడు, 1946 లో జాతీయ జ్వాలలు జావా, ఇండొచైనా, సియాం, బర్మా, ఇరాన్‌నుగూడా ఆవరించినవి). ఆసియాలోని ఈ పునరుద్ధరణనుగుర్తించి భారతీయులు ఇందులో తమ భాగాన్ని సక్రమంగా నిర్వహించ సంసిద్ధులౌతున్నారు. ఆసియా పునరుద్ధరణలో భారతీయులు తమ సహజ బాధ్యత—హక్కులను నిర్వహించకుండా బ్రిటిష్ పాలకులు అడ్డు పడుచున్నారు. బ్రిటిష్‌వారు అడ్డుపడడంవలననే భారత జాతీయభావం, జాతీయోద్యమం, జాతీయ పోరాటం బలపడినవి.

---

## 3. ఇండియాకు ప్రతినిధు లెవరు ?

ఒక దేశంలో స్వాతంత్ర్యోద్యమం చాలకాలం పెరిగి వయస్సు వచ్చినప్పుడు ఆదేశంలో రాజకీయ కక్షీలు అనేకము వుండడం సహజం. ఈ కక్షీలు తమ ప్రత్యేక ఆసక్తుల కనువైన దృష్టిననుసరించును. కాని యీ కక్షీలన్నీ దేశ స్వాతంత్ర్యాన్నే కోరును. ఈ పార్టీలు ధనికవర్గానికో లేక శ్రామిక వర్గానికో, పట్టణవాసులకో లేక గ్రామీనులకో, జమీందారులకో లేక రైతులకో ప్రతినిధులుగా నుంటవి. ఇన్నిపార్టీలలో సహజంగా ఏదో వొకటి ముఖ్యమైనదిగా వుటుంది. ముఖ్య జాతీయాశయాన్ని హెచ్చుగా ప్రతిబింబించే పార్టీ యేదో రాజకీయవేత్త సులభంగా గ్రహించగలుగును.

నేడు ఇండియాలోని యితర పార్టీలన్నిటికన్నా, హెచ్చుమంది భారతీయుల ప్రాతినిధ్యాన్ని వహించగల సంస్థ ఇండియన్ నేషనల్ కాంగ్రెస్. క్రిప్స్ రాయబార విషయంలో యిది చాల ప్రధాన విషయం. సంప్రదింపులు ఆలస్యం లేకుండా వెంటనే ప్రారంభింపబడాలి. ప్రత్యేక వర్గాలు, ప్రత్యేక ఆసక్తులు అనేకమున్నవి. వాటన్నిటిని సంతృప్తిపటిచి కొంతవరకు లొంగవేసుకురావాలి. స్వదేశ సంస్థానాలు, అస్పృశ్యులు, ముస్లింలు (ముఖ్యంగా 'పాకిస్థాన్' వాదులు) మొదలైన వర్గాలను సంతృప్తి పటిచవలసి వుంటుంది. ఇతర ఆసక్తులకు భంగకరంగా యీ వర్గాలలో, యీ ఆసక్తులలో యేదిగాని, అన్నిగాని తమ కోర్కెలను ముందు తృప్తి పటిచమని కోరవచ్చు. ఈ కోర్కెలను తృప్తిపటిచిన యితరవర్గాల ఆశ యాలకు భంగం వాటిల్లవచ్చు. మనం ఒక్క విషయాన్ని గుర్తించిన ఇండియా సమస్యాపరిష్కారంలో చాలా ముందుకు సాగినట్లే. కాంగ్రెస్ హెచ్చుమంది భారతీయుల ప్రతినిధి సంస్థ గనుకనూ, ఏకైక జాతీయ సంస్థగనుకనూ కాంగ్రెస్‌లో ఎన్ని లోటుబాట్లున్నా బ్రిటిష్ ప్రభుత్వం కాంగ్రెస్‌తో రాజీ కుదుర్చుకున్న, అట్టి రాజీ ఇండియాతో కుదుర్చుకున్నట్లే నని మనం భావించగలిగిన మన ప్రయత్నాలు చాలవరకు ఫలించినట్లే. ఇతర అల్పసంఖ్యాకుల హక్కులు, యితర వర్గాల హక్కులు విననూ, వాటి ప్రతినిధులతో సంప్రదించను, వాటి కోర్కెలను సంతృప్తిపటిచను ప్రయత్నించను మన బాధ్యతకూడకలదు. కాని యీ ప్రత్యేకవర్గాలు ఇండియా తరపున మాట్లాడలేవని, కాంగ్రెస్‌తో బ్రిటిష్ ప్రభుత్వం చేసుకునే సమాధానానికి వీరు అడ్డుపడరాదని, జాతీయాశయాలను వీరు భగ్నపటిచడానికి వీలులేదని మనం స్పష్టపటిచడం అత్యవసరం. ఈపాటి మనం చేయగలిగిన మన ప్రయత్నాలు చాలవరకు ఫలోన్ముఖమైనట్లే.

ఏ యితర సంస్థకన్నా ఇండియాతరపున మాట్లాడడానికి కాంగ్రె

సుకు హెచ్చు హక్కున్నదన్న విషయం స్పష్టమే. భారత దేశమంతటి తరపున కాంగ్రెస్ మాట్లాడగలదనడం నిస్సందేహం. రాజకీయ పోరాటాల్లో చాలకాలం అరితేరి, ప్రభుత్వ జులుముల నన్నిటిని చవిచూచిన. గొప్ప శిక్షణపొందిన, ఐక్యతగల వుద్యమం కాంగ్రెస్. 1937 లో ఇండియాలో రాష్ట్రీ యెన్నికలు జరిగినవి. ఈ యెన్నికలలో వోటింగ్ హక్కు కొద్దిమందికిమాత్రమే ఉన్నది. అందువలన కాంగ్రెస్ యీ యెన్నికలలో పాల్గొనడం కష్టమే అయినా కొంత తెగింపుతో యీ యెన్నికలలో పాల్గొనినది. ఇవ్వబడిన వోట్లలో యెక్కువభాగం—యెంతో హెచ్చు భాగం—కాంగ్రెస్‌కేవచ్చినవి. ఇండియాలోని పదునొకండు రాష్ట్రాలలో యెనిమిదింట కాంగ్రెస్ అధికారాన్ని స్వీకరించింది. ఈ ఎన్నికల విజయములవలెనే భారతజాతీయ, రాజకీయ జీవితంలో కాంగ్రెస్ పలుకుబడి, గౌరవంగూడా పెంపొందినవి.

కాంగ్రెస్ వొక అతివాద, సామ్యవాద లేక రైతు వుద్యమమని అనుకోగూడదు. కాంగ్రెస్ మితవాద, మధ్యరకపు రాజకీయోద్యమం. కాంగ్రెస్ పునాదులు రానురాను విశాలమై ప్రజాబాహుళ్యంలో వ్యాపించడం వలన దాని ఆశయం సంపూర్ణ స్వాతంత్ర్యంగామారినది. ఇంతకుపూర్వం భారతీయుల కోర్కెలు కొద్దిపాటివైనా వాటిని బ్రిటిష్ ప్రభుత్వం నిరాకరించడంవలన జాతీయ దృక్పథంలో మార్పుకలిగినది. అందువలననే మితవాద దృష్టికలిగిన కాంగ్రెస్‌కూడా పూర్తిగా మారిపోయింది. గడచిన 30 యేండ్లలో కార్మికసంఘాలు, కార్మికోద్యమం ప్రారంభమైనవి. ప్రభుత్వం నిర్బంధించడంవలన యీ కార్మికోద్యమం దినదినాభివృద్ధి చెందుతునే వున్నది. ప్రస్తుతం (1942 ఆరంభంలో) కమ్యూనిస్టుపార్టీ నిషేధింపబడియున్నది. సామ్యవాదులు "కాంగ్రెస్ సోషలిస్ట్‌పార్టీ" అనుపేర కాంగ్రెస్‌లోచేరి పనిచేస్తున్నారు. రైతులుగూడా, తాము నిరుపేదస్థితిలో

మున్నా, కిసాన్ ఉద్యమాన్ని లేవదీశారు. ప్రస్తుతం రైతు వుద్యమంలో చందము చెల్లించి సభ్యులైనవారి సంఖ్య యించుమించు యేడెనిమిది లక్ష లుంటుంది. స్వాతంత్ర్య స్థాపనకు సాగవలసిన సంప్రదింపులకు, చర్చ లకు, కార్మికోద్యమం చాలా సాయపడగలదు. ఇండియాలో పరిశ్రమలు అభివృద్ధిచెందేకొలదీ కార్మికోద్యమం బలపడక తప్పదు. కార్మికోద్యమం సహజంగా స్వాతంత్ర్యవాంఛను బలపఱచుచున్నది. మత, తెగవైషమ్యాల నెదిరి పనిచేస్తుంది కార్మికోద్యమం. కార్మికోద్యమం జాతీయోద్యమంలో ఐక్యతను చేకూర్చకలిగియున్నది. కార్మికోద్యమం కాంగ్రెస్‌తో చేరక యున్న నిరుపేదలగు శ్రామికులకు యిప్పటివలె కాంగ్రెస్ ప్రాతినిధ్యం వహింపజాలదు.

---

# 4. ఇండియా స్వాభావికంగా మన మిత్రరాజ్యం

ప్రస్తుతం మనం ప్రపంచయుద్ధంలో తగుల్కొని యున్నాము. అందున మనదేశం హెచ్చు క్లిష్టపరిస్థితులలోనున్నది. అందువలన భార తీయ సమస్యను పరిష్కరించడం వలన కలిగే మిలిటరీ లాభాలనుగురించే మనలో హెచ్చుమంది యోచిస్తున్నారు. భారతీయుల సానుభూతిని మనం పొందగలిగిన, వారు మనకు మిత్రులగుటయేగాక, మనకు యితర లాభా లెన్నో సమకూరగలవు. వారి ఆశయాలకు మన ఆశయాలకు వైరుధ్య మేమీ లేదుగనుక స్వాభావికంగానే వారు మనకు (బ్రిటిష్‌వారికి) మిత్రులై యున్నారు—వుంటారుకూడా. తన జనాభానుబట్టి, ఆసియాఖండములో తాను కీలక స్థానమందున్నందునను, తన వుత్పత్తిశక్తి, సైనిక సమీ

కరణకుగల వెనుకబలం అపారమగుటచేతను ఇండియా సుస్థానమునలంక రించి యున్నది. అందువలన ఇండియా మన మిత్రరాజ్యమై యుండడం మన అదృష్టమనే అనాలి. మనదృక్పథాలు, కోర్కెలనుబట్టి మనమూ, భారతీయులుగూడా ప్రజాస్వామ్యవాదులం. ఫాసిజం ద్వేషులంగూడా. భారతీయులు చాలాకాలంగా ఫాసీజానికి ప్రబల విరోధులన్నమాట మనం మఱచిపోతున్నాం. ప్రజాబాహుళ్యానికి జ్ఞాపకశక్తి కుంటుపడడం, భారతీయ వార్తలను బ్రిటిష్ పత్రికలు పూర్తిగా ప్రచురింపకపోవడం, ప్రభుత్వపు సెన్సార్లు యీ వార్తల దూపుమార్పడం ఇందుకు కారణాలు. ప్రస్తుతం యుద్ధంలో పాల్గొనడానికి భారతీయులు చాలకాలం మీనమేషాలు లెక్కించారు. అందువలన, మనకంటే దీర్ఘకాలంగా వారు ఫాసీజానికి ప్రబల విరోధులన్న విషయం మనం మఱచిపోతున్నాం.



నేతాజీ సుభాష్ చంద్రబోస్

భారతీయులు ఫాసీజానికి వ్యతిరేకులన్న సత్యం అందరూ ఎఱిగినదే. జపాన్ మంచూరియాను దండెత్తినది మొదలు— అబిసీనియా, స్పెయిన్, జెకొస్లొవేకియాలు కబళింపబడినప్పుడు— నేటివరకు భారతజాతీయవాదులు ఫాసిస్టు దురాక్రమణాలను బహిరంగంగా ఖండిస్తూ తీర్మానాలు చేస్తూనే వచ్చారు. ఛేంబర్లేన్ అనుసరించిన "సంతృప్తి

పఱచు విధానం''ను ఖండించుతూ వచ్చారు. ఇందులో గమనింప దగిన విషయమొకటున్నది. అక్షరాజ్యాలచేత ప్రచారానికి ఈనాడు ఉపయో గింపబడుచున్న భారతీయ నాయకుడు శ్రీ సుభాస్‌చంద్రబోస్‌ను ఈ యుద్ధం ఆరంభింపకముందే కాంగ్రెస్‌నుంచి వెడలనంపారు.

ప్రస్తుత యుద్ధంపట్ల భారతీయుల వైఖరిని అర్థంచేసుకొవలెననిన 1939 నుంచి మన ప్రభుత్వంచేసిన ప్రకటనలను, తీర్మానాలను భారతజాతీ యోద్యమ ప్రకటనలను. తీర్మానాలను మననం చేసుకోవాలి. ఇండియా ప్రజలు ఈ యుద్ధం జరుగుచున్నంతకాలం తమ ఫాసిస్టు వ్యతిరేకదృష్టిని వదిలినారుకారు. ఫాసిస్టు వ్యతిరేక పోరాటంలో ముఖ్యపాత్రను వహించ డానికి ఆతుర్దాతో, అత్యంత ఆసక్తితో నుండినారు. కాని స్వతంత్రప్రజలు గానైతేనేగాని తాము ఫాసిస్టు వ్యతిరేక పోరాటంలో పాల్గొనలేమని వారి వాదన. అఖిలభారత కాంగ్రెస్ నాయకులు శ్రీ పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ నుడివినట్లు—

> "'మేమీ యుద్ధంలో సంపూర్ణ సహకారం చేస్తాము, అందుకు బదులుగా రాజకీయ స్వాతంత్ర్యమివ్వండి' అని మేము కోరడంలేదు. ఫాసీజాన్ని నాశనంచేయాలంటే ప్రజాయుద్ధంతప్ప వేరు ప్రత్యామ్నాయంలేదు. అట్టి ప్రజాయుద్ధాన్ని ఇండియా ప్రారంభించవలెనన్న ముందు భారతస్వాతంత్ర్య మవసరం."

ఈ భారతీయ దృక్పథాన్ని మనం ఆమోదించకపోవచ్చు. కాని దీనిని గ్రహించలేకపోలేము. ఇటీవలవఱకు ఇండియాలో ప్రజలున్నారన్న విషయమే బ్రిటిష్ ప్రభుత్వ దృష్టిలో నున్నట్లులేదు. ఇండియా మనకు సాయపడకపోయినా యుద్ధాన్ని సాగించి జయించగలమనే మూఢనమ్మకం బ్రిటిష్ ప్రభుత్వానికున్నది. పైగా ఇండియా కోర్కెలను లవలేశమైనా ఆదరించకుండా, భారతీయస్వాతంత్ర్యాన్ని ఏవిధంగానూ గుర్తించకుండా

ఈ యుద్ధంలో మనం చెప్పినట్లు ఇండియా చేయవలెనని మనప్రభుత్వం ఎదురుచూస్తూ వున్నది.

పై చెప్పబడిన బ్రిటిష్ ప్రభుత్వ ప్రవర్తనను కొన్ని సంఘటనల సాయంతో రూపించవచ్చును. 1939 సెప్టెంబరులో ఈ యుద్ధం ఆరంభమైన వెంటనే ఇండియా ప్రజల అనుమతిలేకుండా, వారి ప్రతినిధులతో సంప్రదించకుండా ఇండియా యుద్ధంలో చేరినట్లు బ్రిటిష్ ప్రభుత్వం ప్రకటించింది. నాటినుండి ఈ కొత్తకధనం ప్రారంభమైనది. ఈ యుద్ధానికి కారణం బ్రిటిష్ ప్రభుత్వం అవలంబించుచూ వచ్చిన "సంతృప్తిపరచుట" అన్న విధానమే. ఈ విధానాన్ని భారతీయులు తీవ్రముగా నిరసించియున్నారు. బ్రిటిష్ ప్రభుత్వం ఈ యుద్ధంలోకి ఇండియాను లాగగానే కాంగ్రెస్ తగుచర్య తీసుకొన్నది. 15-9-1939 న కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ ఒక తీర్మానంచేసింది. ఈ తీర్మానాన్ని 10-10-1939 న అఖిల భారత కాంగ్రెస్‌కమిటీ ధృవపఱచినది. ఈ తీర్మానంలోని కొన్ని భాగాలు ఈ దిగువ నుదహరింప బడినవి—

"భారతదేశం యుద్ధంలోకి దిగినట్లు బ్రిటిష్ ప్రభుత్వం ప్రకటించింది. ఆర్డినెన్స్‌లను అమలులోనికి తెచ్చినది. "ఇండియా ప్రభుత్వ సవరణబిల్లు"ను శాసించినది. భారతప్రజల దైనందిన జీవితానికి సంబంధించిన విషయాలలో క్లిష్టత కలుగజేసే చట్టాలెన్నిటినో అమలులోనికి తెచ్చినది. రాష్ట్రప్రభుత్వాల అధికారాన్ని, చర్యలను కుంటుపరిచే శాసనాలను శాసించినది. ఈ ప్రయత్నాలన్నీ భారతప్రజల అనుమతిలేకయే చేయబడినవి. భారతీయులు విస్పష్టంగా ప్రకటించిన ఆశయాలను, కోర్కెలను బ్రిటిష్ ప్రభుత్వం నిండుమనస్సుతో త్రోసిపుచ్చినది.

"ఫాసీజమును, నాజీజమును, వాటి ఆశయాలను, అనుచరుణను యుద్ధంపట్ల, హింసపట్ల వాటికిగల అభిమానమును, మానవ వుత్సాహాన్ని అణచివేయను అవిచేసే అమానుష ప్రయత్నాలను కాంగ్రెస్ అనేకమార్లు

తీవ్రంగా ఖండించియున్నది. నాగరికతకు విముఖంగా నాజీజం, ఫాసీజంలు యుగయుగాలుగా అచరణయందున్న సిద్ధాంతములను, ప్రవర్తనను త్రోసి వేసినవి. ఇట్టి నడవడిని, వాటి అత్రికమణను కాంగ్రెస్ పలుమారులు ఖండించియున్నది. ఫాసీజం, నాజీజములలో భారతీయులు, సామ్రాజ్య వాదంయొక్క తీవ్రదశను చూడగలిగినారు. అట్టి సామ్రాజ్యవాదాన్నెదిరి ఇండియా ప్రజలు ఏండ్లపర్యంతం పోరాడుతునే ఉన్నారు. అందువలన జర్మనీలోని నాజీ ప్రభుత్వం పోలెండుమీద మొనమొన్న ప్రారంభించిన దురాక్రమణను వర్కింగ్ కమిటీ నిస్సంకోచంగా ఖండించవలెను. జర్మను దురాక్రమణ నెదిరి పోరుచున్నవారికి వర్కింగ్ కమిటీవారు సాను భూతి చూపవలెను.

"ఇండియా యుద్ధంచేయడమా, శాంతియుతంగా నుండడమా అన్నవిషయం ఇండియా ప్రజలే తీర్మానించవలెనుగాని ఏ విదేశాధికారంగాని యిట్టి తీర్మా నాన్ని భారతీయులపై మోప వీలులేదని కాంగ్రెస్ తీర్మానించినది. భారత దేశ సంపదను సామ్రాజ్యవాద రక్షణలకు దోచుకోనివ్వరు భారతీయులు. భారతీయుల అనుమతి లేనిదే ఇండియా సంపదను ఉపయోగించుకొనను ప్రయత్నించినా, బ్రిటిష్‌వారి తీర్మానములను భారత ప్రజలపై మోప ప్రయత్నించినా అట్టి ప్రయత్నాలను భారతీయులు నిరోధించాలి. మంచి ఆశయానికైనా సహకారం కావాలంటే బలవంతంమీద. ఒత్తిడిమీద పొం దడం కష్టం. విదేశ అధికారానికి భారతీయులు అణగి, మణగి పోగూడ దని వర్కింగ్ కమిటీ కోరిక. భారతీయులు బానిసలుగా వర్తించడానికి వర్కింగ్ కమిటీ ఒప్పుకొనజాలదు.

"ఇరువైపులవారూ తగిన ఆశయమని అంగీకరించినగూడా సహకారం ఎప్పుడూ సరిసమానులమధ్య, పరస్పర అంగీకారంపైన ఏర్పడాలి. ఇటీవల భారతీయులు అనేక కష్టాల నెదుర్కొన్నారు. ఇండియాలో ప్రజా స్వామ్య, స్వతంత్రరాజ్యాన్ని స్థాపించను, తమ స్వాతంత్ర్య సంపాదనకు మనస్ఫూర్తిగా అనేక త్యాగాలు చేశారు. భారతీయుల సానుభూతి పూర్తిగా స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్యములపైననే వున్నది. ఈ యుద్ధం ప్రజాస్వా

మ్యాన్ని రక్షించను, స్వాతంత్ర్యాన్ని భద్రపఱచను సాగింపబడుచున్నదని మిత్రమండలివారు ప్రకటించుచున్నారు. ప్రజాస్వామ్యం, స్వాతంత్ర్యం తనకే నిరాకరింపబడినప్పుడు ఈ యుద్ధంలో ఇండియా ఏలా పాల్గొం టుంది? పైగా తనకున్న కొద్దిపాటి స్వాతంత్ర్యాన్నిగూడా యీ యుద్ధమన్న మిషతో బ్రిటిష్‌వారు కుంటుపఱచుచున్నప్పుడు?

"ఈ యుద్ధం సామ్రాజ్యాలను, వలసరాజ్యాలను, సామ్రాజ్యవాదుల ఆస్తిపాస్తులను, హక్కులను రక్షించడానికి, ప్రస్తుత పరిస్థితులను నిలబెట్టడానికీ అయితే ఈ యుద్ధంతో ఇండియాకేమీ సంబంధంలేదు. అటుగాక ఈ యుద్ధం ప్రజాస్వామ్యస్థాపనకైతే ఇండియాకు ఈ యుద్ధంలో ఎంతో ఆసక్తిగలదు. ఇండియా ప్రజాస్వామ్య ఆశయాలకు బ్రిటిష్ ప్రజాస్వామ్య ఆశయాలతోగాని, ప్రపంచ ప్రజాస్వామ్య ఆదర్శాలతోగాని ఏవిధమైన సంఘర్షణ లేదని ఈ కమిటీయొక్క దృఢనమ్మకం. కాని ఇండియాలోని ప్రజాస్వామ్యానికిగాని మరెచ్చటి ప్రజాస్వామ్యానికిగాని సామ్రాజ్యవాదంతోనూ, ఫాసిజంతోనూ స్వతస్సిద్ధమైన, త్రోసిపుచ్చలేని వైరుధ్యం కలదు.

"ప్రజాస్వామ్యాన్ని నిలబెట్టను, వ్యాపింపను గ్రేట్ బ్రిటన్ పోరాడుచున్న, మున్ముందు తన వలస రాజ్యాల్లో సామ్రాజ్యవాదాన్ని అంత్యమొందించాలి. ఇండియాలో పూర్ణప్రజాస్వామ్యాన్ని నెలకొల్పాలి. భారతీయులు పరుల జోక్యము లేకుండా తమ ప్రభుత్వ నిర్మాణ చట్టాన్ని ప్రజా పరిషత్తుద్వారా యేర్పాటుచేసుకొని, తమ ఇచ్చవచ్చిన పంథాను అభివృద్ధిని సాగించాలి. స్వాతంత్ర్య ప్రజాస్వామ్య భారతదేశం దురాక్రమణ నెదిరి పరస్పర రక్షణకై, ఆర్థిక సహకారమునకై ఇతర జాతులతో సంతోషంగా సఖ్యత కుదుర్చుకుంటుంది. ప్రపంచం ప్రస్తుతం పొందియున్న విజ్ఞానసంపదను, ఉత్పత్తి సాధనాలను మానవజాతియంతటి అభివృద్ధికి, సౌఖ్యానికి ఉపయోగింప బడునటుల స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్యం పునాదులుగా నూతన ప్రపంచ పథకాన్ని స్థాపించను ఇండియా పాటుబడుతుంది.

"ఆధునిక సామ్రాజ్యవాద పీడిత పరిపాలనకు ఇండియా ప్రబల నిదర్శనం. ఈ ముఖ్యసమస్యను మఱచి ప్రపంచ పునర్నిర్మాణమునకు చేసేప్రయత్నా

లన్నీ విఫలముగాక తప్పదు. తనకుగల అపార సంపదవలన యెట్టి ప్రపంచ పునర్నిర్మాణ ప్రయత్నంలోగాని ఇండియా ముఖ్యపాత్రను నిర్వహింపక తప్పదు. కాని అట్టి ఉత్కృష్ట కార్యాన్ని నిర్వహించను ఇండియా సర్వశక్తులు త్వరలోనే బానిస బంధములనుంచి సడలింపబడాలి. స్వతంత్ర దేశంగాగాని అట్టి బాధ్యతను ఇండియా సక్రమంగా నిర్వహింపజాలదు. ఈనాడు స్వాతంత్ర్యం వ్యక్తిగతమైయున్నది. ప్రపంచంలో యేభాగంగాని సామ్రాజ్యవాద అధికారాన్ని నిలబెట్టను చేసే ప్రయత్నాలు కొత్త కడగండ్లకు దారితీయక తప్పదు.

"ప్రజాస్వామ్యం నిజంగా వర్ధిల్లవలెనన్న సామ్రాజ్యవాదము, ఫాసీజము, నాజీజము పూర్తిగా నాశనముచేయబడుటయేగాక నిన్నటివరకూ—నేడు కూడా—వీటి అడుగుజాడల నంటివస్తున్న దురాక్రమణలనుగూడా అంత్యమొందించాలి.

"అట్టి పునాదులపైగాని నూతనవ్యవస్థ నిర్మింపబడజాలదు. అట్టి నూతన ప్రపంచస్థాపన కవసరమగు పోరాటంలో పూర్తిగా తమ సాయశక్తుల పాల్గొనుటకు ఈ కమిటీవారు ఆతురతతోనూ, అత్యుత్సాహంతోనూ ఉన్నారు. కాని సామ్రాజ్యవాద మార్గాల నడుపబడు ఈ యుద్ధంతో, ఇండియాలోనూ, మరి అనేక యితర చోట్లలోనూ సామ్రాజ్యవాదాన్ని బలపఱచను సాగింపబడు ప్రస్తుత యుద్ధంతో ఈకమిటీవారు ఏకీభవింపజాలరు. ఈ యుద్ధప్రయత్నాలకు సహకార మివ్వజాలరు.

"ప్రస్తుత పరిస్థితుల తీవ్రతను గుర్తించి—ఇటీవల కొద్ది దినాలలో పరిస్థితులెంత తీవ్రంగా, మానవుల మనోవేగాన్ని మించినవేగంతో నడచుచున్నదీ గుర్తించి—ఈ కమిటీ ఏ అంత్య నిర్ణయానికి ఇప్పట్లో రాదలచుకొనలేదు. ఈ యుద్ధంలో పెనగుబడియున్న సమస్యల వివరణకై ఈ యుద్ధ ఆశయాలేమిటో, ప్రస్తుతం ఇండియాస్థితియేమిటో, ముమ్ముందు ఇండియా స్థితి ఎట్లుండగలదో, మొదలైన సమస్యల వివరణకు వీలుకలుగచేయను ఈ కమిటీ ఏస్థితిలో అంత్యతీర్మానాన్ని చేయక ఆగినది. ఇండియా ఏరోజు కారోజు తానంగీకరింపని, తాను నిరసించే విధానాన్ని బలపఱచను ఉపయో

గింపబడుచున్నది. అందువలన ఈ తీర్మానాన్ని చాలాకాలం అపదానికి వీలు లేదు.

"ప్రజాస్వామ్యంపట్ల, సామ్రాజ్యవాదంపట్ల, రానున్న నూతన ప్రపంచ వ్యవస్థపట్ల వారియుద్ధ ఆశయాలేమిటో విస్పష్టంగా ప్రకటించమని బ్రిటిష్‌వారిని వర్కింగ్ కమిటీ కోరుచున్నది. ముఖ్యంగా ఈ ఆశయాలు ఇండియా కెలావర్తించేది, ప్రస్తుతం ఇది ఇండియాకేలా ఉపయుక్తమయ్యేది బ్రిటిష్‌వారు విశదపఱచాలని వర్కింగ్ కమిటీ కోరుచున్నది. బ్రిటిష్‌వారి యుద్ధ ఆశయాలు సామ్రాజ్యవాద సమాప్తిని సూచించగలవా? తన ప్రజల కోర్కెల ననుసరించి ఇండియా తన ఇచ్ఛవచ్చిన మార్గాన నడువను వీలయ్యేట్లు ఇండియాను స్వాతంత్ర్యదేశంగా పాటించడం ఈ ఆశయాల్లో యిమిడియున్నదా?

"అంతః కలహాలను, అనవసర చర్చలను అంతమొందించమని; ఈలాంటి క్లిష్ట సమయమందు గృహచ్ఛిద్రాలు కూడవని; ఒక్కజాతిగా—సంయుక్త సంఘటిత ఏకజాతిగా నిలబడను సిద్ధపడమని; ప్రపంచస్వాతంత్ర్యంలో నొకభాగంగా భారతస్వాతంత్ర్య సముపార్జనకు సంసిద్ధులై, స్థిరసంకల్పులై యుండమని ఈ కమిటీ భారతీయులందరిని మనఃపూర్వకముగా ప్రార్థించుచున్నది."

కాంగ్రెస్ వర్కింగ్ కమిటీవారి పై కోర్కెల ననుసరించి బ్రిటిష్ ప్రభుత్వం ఏమీ చేయలేదు. తమయుద్ధ ఆశయాలేమిటో ప్రకటించనూ లేదు. తమసామ్రాజ్యవాద విధానాన్ని విసర్జించనూలేదు. పై వర్కింగ్ కమిటీ తీర్మానానికి ఆనెలలోనే (సెప్టెంబరు 1939) బ్రిటిష్‌వాలకు లొక జవాబిచ్చారు. ఇండియాలో తమ ఆదేశం అధినివేశ ప్రతిపత్తి స్థాపనయని; గవర్నర్ జనరల్‌గారి కౌన్సిల్‌లో రాజకీయ పార్టీల ప్రతినిధులను చేర్చుకోడానికి తాము సుముఖులేనని; యుద్ధవిషయాలలో సలహానివ్వను కొత్తగా నొక సలహా సంఘాన్ని స్థాపించనున్నారని ప్రకటించారు. "అధినివేశ ప్రతిపత్తి" అన్నపదానికి నెంతో అర్థమున్నది. ఈ పదానికి మంచి అర్థం

ఈవచ్చు. ఈ పదాన్నిగురించి చెడ్డవ్యాఖ్యనుగూడా చేయవచ్చు. దీనికిగల అర్థం కొన్నివేళల ఉపయోగకారి కాగలదు. కొన్నివేళలందు అపకారి అవుతుందిగూడా. ఇండియాకు అధినివేశ ప్రతిపత్తి నిస్తామని గడచిన యుద్ధమప్పుడే (1914-18) వాగ్దానాలు చేయబడినవి. కాని ఈ వాగ్దానాలను బ్రిటన్ చెల్లించుకొనలేదు. మొదటి ప్రపంచయుద్ధానికి ఈ యుద్ధానికి మధ్యకాలంలో గడచిన యిరవైయేండ్లలో నెన్నడైనా అధినివేశ ప్రతిపత్తిని బ్రిటిన్ యిచ్చివున్న భారతీయులు బహూశ పుచ్చుకునేవారే. కాని 1939 లో యుద్ధమారంభమైన తర్వాత 'అధినివేశప్రతిపత్తి' రూపమేమారిపోయింది. అది భారతీయుల నేమాత్రం సంతృప్తిచేయజాలదు. స్వాతంత్ర్య సముపార్జనకై సర్వతోముఖంగా అభివృద్ధిజెందిన జాతీయోద్యమం "అధినివేశ ప్రతిపత్తి"తో 1939 లో తృప్తిచెందుతుందనుకోడం తెలివితక్కువతనం. చాలాకాలాతీతమైపోయింది. బ్రిటిష్‌వారి ప్రకటనలోని మిగత భాగాలు అధికారాన్ని నిజంగా భారతీయుల హస్తగతం చేయకుండా ఉండడానికి మన మెరిగిన, మనకలవాటైన పాత కథలవంటి బొల్లికథలే. అప్పట్లో గవర్నర్ జనరల్ కార్యనిర్వాహకవర్గ సభ్యులను హెచ్చించలేదు. సలహా సంఘాన్ని స్థాపించనూలేదు. ఈవిధంగా తమ వాగ్దానాలను ఆచరణలో రూపించకపోయినారు బ్రిటిష్‌వారు. తమ తప్పును భారతీయులపై మోపను మరియొక వాదననుగూడా లేవదీశారు. ఈ ఆలస్యానికి కారణం భారతదేశంలోని ముఖ్యమైన పార్టీలలో అంగీకారం, సహకారం లేకపోవడమే నని బ్రిటిష్‌వారి వాదన—దుష్ప్రచారమున్నూ.

పిదప 1914-18 లో వలెనే, బ్రిటిష్ ప్రభుత్వం ఇండియాలో యుద్ధప్రయత్నాలను తనయిచ్చవచ్చినట్లు సాగింప నారంభించింది. బ్రిటన్ యుద్ధంలో మునిగియున్నది గనుక ఇండియా బాగోగుల నాలోచించకుండా భారతసైన్యాలను తమ యుద్ధంనిమిత్తం ఇండియాకు వెలుపల

కూడ బ్రిటిష్‌వారు ఉపయోగించ మొదలెట్టారు. యుద్ధం అరంభమైన ఐదు నెలలకు, 1939 అక్టోబరునుంచి జరిగిన ఐదు నెలలకు, అఖిలభారత కాంగ్రెస్ రామ్‌ఘర్‌లో సమావేశమైనది. ఈ ఐదుమాసాల్లో యూరప్ యుద్ధంలో గొప్ప సంభవాలేమీ జరగలేదని మనం జ్ఞాపకంముంచుకోవాలి. అఖిలభారత కాంగ్రెస్ అసంఖ్యాక ఓట్లతో ఈ దిగువ తీర్మానాన్ని చేసింది—

"యూరప్‌లో యుద్ధం ప్రారంభమైనందున యేర్పడిన అతిక్లిష్టపరిస్థితిని, దానిపట్ల బ్రిటిష్‌వారవలంబించిన విధానాన్ని గమనించి కాంగ్రెస్ కార్య నిర్వాహక సభ, (వర్కింగ్ కమిటి) అఖిలభారత కాంగ్రెస్ కమిటీ (ఎ. ఐ. సి. సి) ఈ యుద్ధ పరిస్థితులపై చేసిన తీర్మానాలను, తీసుకున్న చర్యలను ఈ కాంగ్రెస్ మహాసభ ఆమోదించి, ధృవపరచుచున్నది.

'భారతీయుల అనుమతి, ఆమోదము లేకుండా బ్రిటిష్‌ప్రభుత్వం ఇండియాను యుద్ధంలోకి లాగడం, ఈ యుద్ధానికి ఇండియా సంపదను ఊడ్చడం భారతీయ ప్రజలను అవమానపఱచడంగా ఈ కాంగ్రెస్ భావించుచున్నది. ఇట్టి అవమానాన్ని, ధిక్కారాన్ని స్వాతంత్ర్య పిపాసులైన, స్వగౌరవాభిమానముగల ఏ ప్రజలైనా సహింప జాలరు. ఇట్టి ధిక్కారాన్ని ఓర్చుకొనలేరు గూడాను.

"ఇండియాను గుఱించి బ్రిటిష్ ప్రభుత్వం తరఫున ఇటీవల కొన్ని ప్రకటనలు చేయబడినవి. గ్రేట్ బ్రిటన్ యీ యుద్ధాన్ని ప్రప్రథమంగా తన సామ్రాజ్యవాద ఆశయాల ఫలితంకొఱకు, తన సామ్రాజ్యాన్ని రక్షించుకొని, బలపఱచుకోగలిగేందుకుగా సాగిస్తూందని ఆ ప్రకటనలే విప్పిచెప్పుచున్నవి. బ్రిటిష్ సామ్రాజ్యం భారతీయుల దోపిడిపై, ఆసియాఖండపు ఇతరదేశాల, ఆఫ్రికాఖండపుదేశాల దోపిడిపై ఆధారపడియున్నది.

"ఇట్టి పరిస్థితులలో స్పష్టముగాగాని, జాడగాగాని ఈ యుద్ధంలో కాంగ్రెస్ సాయపడజాలదన్న విషయం విదితమే. ఈ యుద్ధానికర్థం భారతదేశ బానిసత్వం సాగుతూ ఉండడమునూ, స్థిరపడడమునూ.

"అందువలన ఈ యుద్ధం నిమిత్తం మనుష్యులను, వస్తుసామగ్రిని ఇండియానుంచి దోచుకోడాన్ని, భారత సైనికులను సామ్రాజ్యంకొఱకు పోరాడ నుపయోగించడాన్ని ఈ కాంగ్రెస్ అతి తీవ్రంగా ఖండించుచున్నది. సైన్యంలో మనుష్యులను చేర్పించడంకాని, ఇండియాలో వసూలుచేసినడబ్బు కాని ఇండియా తనయధేచ్ఛగా యిచ్చిన సాయము కాజాలదు. కాంగ్రెస్ వారు కాని, కాంగ్రెస్ ఆ దేశాన్ని అనువర్తించే యితరులుగాని ఈ యుద్ధ నిర్వహణార్థం సైనికులను, డబ్బును, సామగ్రిని సమకూర్చను సాయపడలేదు.

"భారతీయులు సంపూర్ణ స్వాతంత్ర్యం తప్ప యితర మేదీ అంగీకరించరని కాంగ్రెస్ మరల ఘంటాపథంగా ప్రకటిస్తూ ఉన్నది. సామ్రాజ్యవాదంలో గాని, అధినివేశప్రతిపత్తిలోగాని, మఱియేయితర సామ్రాజ్యవాద కుయుక్తులలోగాని భారత స్వాతంత్ర్యం ఇముడజాలదని, అట్టి మిథ్యాస్వాతంత్ర్యం ఇండియాకు వర్తింపదని, భారతీయులవంటి గొప్పజాతిగౌరవానికి తగినదికాదని, పైగా అట్టి మిథ్యా స్వాతంత్ర్యం బ్రిటిష్‌వారి కుట్రలకు, ఆర్థిక విధానానికి ఇండియాను అనేకవిధాల బంధించి వేస్తుందని కాంగ్రెస్ ప్రకటించుచున్నది.

"వయోజనునికి ప్రతియొక్కనికి ఓటు హక్కు నిచ్చినపిదప ఎన్నుకొనబడిన ప్రజాపరిషత్తుద్వారా భారతీయులు తమ ప్రభుత్వనిర్మాణ విధానాన్ని, ప్రపంచంలోని ఇతర దేశాలతో భారతదేశానికి గల సంబంధబాంధవ్యాలను నిరూపింపగలరు. మఱి ఇతరులెవరికి ఈ హక్కు లేదు.

"ఇంతకుముందువలెనే ఇప్పుడూ, ఇకముందుకూడా కాంగ్రెసు మతసామరస్యాన్ని సమకూర్చను ప్రయత్నింప సిద్ధముగా నున్నది. కాని ప్రజాపరిషత్తుద్వారా తప్ప శాశ్వత మతసమస్యా పరిష్కారం చేకూరదని ఈకాంగ్రెసు అభిప్రాయం. గుర్తింపబడిన అల్పసంఖ్యాకుల హక్కులన్నీ వీలైనంతవఱకు సంప్రదింపులు, ఒప్పందాలమూలంగా ప్రజాపరిషత్తుచే పూర్తిగా రక్షింపబడవచ్చు. అనేక అల్పసంఖ్యాక వర్గాలు, బహుసంఖ్యాకవర్గాలు ఎన్నుకునే ప్రతినిధులకు పరస్పరం సంప్రదింపులు జరిగి ఒడంబడిక



మహాత్మా గాంధీ—జనాబ్ జిన్నా

ఏర్పడాలి. ఏ సమస్యపైనైనా ఒడంబడిక కుదరకున్న ఇరు పక్షాలవారూ మధ్యవర్తిత్వానికి ఒప్పుకోవాలి.

"పై విధానంతప్ప మఱే యితర ప్రయత్నము శాశ్వత తీర్మానాలను చేయజాలదు. ఇండియా నూతన నిర్మాణ చట్టం స్వాతంత్ర్యం, ప్రజా స్వామ్యం, జాతీయ ఐక్యత లపై నాధారపడియుండాలి. ఇండియాను విభజించడానికి, భారత జాతీయతను విచ్ఛిన్నపఱచడానికి జరుగుచున్న ప్రయత్నాలను కాంగ్రెసు ఖండించుచున్నది.

"ప్రతి ముఠాకు, ప్రతివ్యక్తికి సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని, అభివృద్ధి కను వగు సదవకాశాలను సమకూర్చే నిర్మాణచట్టమే ఎల్లప్పుడూ కాంగ్రెసు ఆశయముగా నున్నది. సాంఘిక అన్యాయాల నంతమొందించి, న్యాయ మైన సాంఘిక వ్యవస్థను స్థాపించగల నిర్మాణచట్టమే కాంగ్రెసులక్ష్యం."

1940 జూన్‌లో ఫ్రాన్స్‌ను హిట్లరు దండెత్తి పూర్తిగా ఓడించాడు. యూరప్‌లోని మిలిటరీ పరిస్థితులు అతిక్లిష్టతను బొందినవి. అప్పటి యుద్ధపరిస్థితివిబట్టి బ్రిటిష్ ప్రభుత్వంతో నేదో యొకవిధంగా రాజీ కుదర వచ్చునని, తద్వారా ఇండియా స్వాతంత్ర్యం పొందగలదని, ఫాసిజాన్నెదిరి గ్రేట్ బ్రిటన్ చేయుచున్న యుద్ధంలో ఇండియా సహాకారం చేయ డానికి సమయమాసన్నమైనదని కాంగ్రెస్‌లో చాలమంది ఆశపడ్డారు. అప్పట్లో, ఫ్రాన్స్‌పతనం కారణంగా, ఫాసిజం చాల బలపడినది. అందు

వలన బ్రిటన్ ఇండియాతో రాజీ పడుతుందని చాలమంది అనుకున్నారు. తదనుగుణంగా, జూలై 7 న కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ ఈ దిగువ తీర్మానాన్ని చేసింది—

"భారత రాజకీయాల్లో ప్రతిష్టంభనను పరిష్కారంచేయమని కొందరు కోరారు. ఈ కోరికలకు కారణం ప్రపంచయుద్ధంలో ఇటీవల కొన్ని విపరీత సంఘటనలు సంభవించడమే. ఈ సంఘటనలను కాంగ్రెసు కార్య వర్గం గుర్తించినది. అందువలన కాంగ్రెస్‌స్థితి యేమిటో విశదపఱచడ మవసరమైనది. అందుకుగాను, ప్రపంచ పరిస్థితులలో ఇటీవల జరిగిన ఉదంతాలన్నిటిని జ్ఞాపకముంచుకొని మఱల నొకమారు భారతీయస్థితిని సింహావలోకనము చేయడమైనది.

"బ్రిటన్, ఇండియాల నెదుర్కొంటున్న సమస్యలన్నిటికి పరిష్కార మార్గం ఒక్కటే వొక్కటున్నదని వర్కింగ్‌కమిటీ విశ్వాసం. ఈ విశ్వా సం పూర్వంకన్నా హెచ్చుగా ఇప్పుడు ధృవపడినది. ఈ పరిష్కార మార్గం భారతదేశంలో సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని నెలకొల్పడమే. అందు వలన బ్రిటన్ తక్షణమే భారత స్వాతంత్ర్యాన్ని ప్రకటించాలి. అట్టిప్రకట నను వెనువెంటనే కార్యరూపంలోకి మార్చగలందులకు కేంద్రంలో (ఢిల్లీలో) తాత్కాలిక జాతీయ ప్రభుత్వాన్ని నెలకొల్పాలి. ఇది కేవలం తాత్కాలిక ప్రయత్నమే అయినా కేంద్రశాసన సభలలోని యెన్నుకొన బడిన సభ్యులలో బహుసంఖ్యాకుల మద్దతును ఈ తాత్కాలిక ప్రభుత్వం కలిగివుండాలి. పైగా, రాష్ట్రాల్లో బాధ్యతాయుత, ప్రజా ప్రతినిధి ప్రభుత్వా లేర్పడాలి. కేంద్రజాతీయ ప్రభుత్వం రాష్ట్రప్రభుత్వాల సహకారాన్ని పొంద గలుగునదిగా యుండాలి.

"పై చెప్పబడిన ప్రకటన చేయబడక పోయిన, తదనుగుణంగా జాతీయ ప్రభుత్వం వెంటనే నెలకొల్పబడకపోయిన బ్రిటిష్‌వారు యిప్పుడు ప్రచారం చేస్తున్నదంతా సర్వాబద్ధమని రుజువైనట్లే. 'ఇండియాయొక్క ఆర్థిక, నైతిక బలాన్ని దేశరక్షణకోసం సమాయత్తపఱచుచున్నాం. ఈ ప్రయత్న

మంతా బలవంతం. ఒత్తిడిలేకయే జరుగుచున్నది' అని బ్రిటిష్‌వారు ప్రచారంచేస్తున్నారు. స్వాతంత్ర్య దేశంచేసే ప్రయత్నాలకు ఈ ప్రయత్నాలు ఏవిధంగాను సమానంకాజాలవు. అందువలన ఈ ప్రయత్నాలంత ఉపయోగకారులుగానుండవు. మా సలహానామోదించి పై చర్యలు తీసుకొనబడిన దేశరక్షణ కవసరమైన సర్వప్రయత్నాలలో కాంగ్రెసు తన బలాన్ని చేర్చి దేశరక్షణను సఫలీకృతంచేయడానికి అవకాశముంటుందని వర్కింగ్ కమిటీవారు ప్రకటిస్తున్నారు."

28-7-40 న అఖిలభారత కాంగ్రెస్ కమిటీవారు (ఎ. ఐ. సి. సి.) దీర్ఘచర్చ జరిపి, ఈ తీర్మానాన్ని మూడింట రెండు వోట్లతో ఆమోదించి, బలపరిచారు. ఈ తీర్మానమప్పుడు ఓటుచేయనివారు కొందరున్నారు. పై తీర్మానంలోని విషయాలను వైస్రాయిగార్కి తెలియజేశారు. ఇందుకు బ్రిటిష్ ప్రభుత్వం తరపున వైస్రాయి ఆగస్టు 8 వ తారీకున పెద్ద ప్రకటన మూలంగా జవాబిచ్చాడు. ఈ ప్రకటనను భారతీయులందరుగూడా అసంతృప్తికరమైనదిగా భావించారు.

ఈ ప్రకటనలో నాలుగు ముఖ్యవిషయాలున్నవి. ఇండియాలోని ప్రజలలో పరస్పర వైషమ్యాల కారణంగా జాతీయ ఐక్యత ప్రస్తుతం అసంభవమైనది అన్న పాతపాటనే మరల పాడడం మొదటిది. భారత దేశంయొక్క శాంతి, భద్రత సౌఖ్యాలకుగాను బ్రిటిష్ ప్రభుత్వం కొన్ని బాధ్యతలను ప్రస్తుతం నిర్వహించుచున్నది. ఏ ఇతర ప్రభుత్వ విధానానికి తాము అధికారాన్ని అప్పగింపవలసి వచ్చినా అందుకు ఇండియా జాతీయ జీవితంలోనున్న ప్రబల శక్తులన్నీ అంగీకరించాలి. ఈ ప్రబలశక్తులేవైన నూతన ప్రభుత్వ విధానానికి ఒప్పుకొనకున్న బ్రిటిష్‌వారు తమ బాధ్యతలను వదలుకోరు. అధికారాన్ని నూతన ప్రభుత్వం చేతికి ఒప్పగింపరు. అట్టి శక్తులను బలవంతపఱచి నూతన ప్రభుత్వమునకు లొంగజేయుటకు బ్రిటిష్ ప్రభుత్వము సాయపడజాలదు. ఇది రెండవ విషయం.

ఈ రెండవ విషయంచూస్తే పైకి నిరపాయకరమైన గొప్ప ఆశయంవలె కనబడుతుంది. కాని ఇందులో యెంతో విషమున్నదని భారతీయులు అనుమానపడడాన్ని మనం మన్నింపక తప్పదు. వారి అనుమానాలకు కారణాలు రెండు—(i) న్యాయమైన తీర్మానానికి అంగీకరించకుండా, బహు సంఖ్యాకవర్గానికి విరుద్ధంగా, అభివృద్ధినిరోధకంగా, స్వాతంత్ర్యాన్ని అరికట్టను ఏ అల్పసంఖ్యాక వర్గాన్నిగాని ఈ ప్రతిపాదన ప్రోత్సహించవచ్చు. (ii) అల్పసంఖ్యాక వర్గాలను లేవదీసి భారతజాతీయ ఆశయాలను, అభివృద్ధిని అరికట్టను, తద్వారా అన్నిపార్టీలవారిని మోసగించి ఇండియాలో బ్రిటిష్ పరిపాలనను సాగించడానికి బ్రిటిష్ ప్రభుత్వంలోని కొన్ని దుష్టశక్తులు చేసిన ప్రయత్నమిది.

కొందరు భారతీయులను గవర్నర్ జనరల్ కౌన్సిల్‌లో (కార్యనిర్వాహకసభలో) చేరమని ఆహ్వానించడం మూడవది. సంస్థానాధీశుల ప్రతినిధులతో, దేశంలోని మఱికొన్ని సంస్థల ప్రతినిధులతో యుద్ధసలహా సంఘాన్ని ఏర్పాటు చేయడం ఇందులో నొకభాగం. అధినివేశ ప్రతిపత్తిని ఇండియాలో ఏర్పఱచను నూతన నిర్మాణ చట్టాన్ని వుపపాదించడం నాల్గవది. ఈ విషయమై వైస్రాయి ఉపన్యాసంలోని ఈ క్రిందిభాగాన్ని ఉదహరింపదగును—

"బ్రిటిష్ కామన్వెల్త్ తనప్రాణాన్నిదక్కించుకోను ఈ యుద్ధంలో ఘోరంగా పోరాడుచున్నది. ఇట్టి యుద్ధసమయంలో ప్రభుత్వవిధానాల పునాదులను మార్చడానికి ప్రయత్నంచేయడం తగదని అందరెఱిగిన విషయమే. కాని, యుద్ధం ముగిసినవెంటనే, ఏపాటి ఆలస్యంలేకుండా ఇండియా నూతన నిర్మాణచట్టాన్ని యేర్పాటుచేయను జాతీయ ప్రతినిధులతోకూడిన సమావేశాన్ని చేర్చను బ్రిటిష్ ప్రభుత్వం మనఃపూర్తిగా అంగీకరిస్తుంది. ఈ విషయాన్ని ప్రకటించమని నన్ను బ్రిటిష్ ప్రభుత్వము కోరినది. బ్రిటిష్ ప్రభుత్వం తన శక్తివంచనలేకుండా ప్రతి సమస్యా పరిష్కారానికి

తనచేతనైన సహాయాన్ని సంపూర్ణంగా చేస్తుంది. ఇంతలో భారతీయ ప్రజా ప్రతినిధులు వివిధ పార్టీలమధ్య సమధానాన్ని కుదర్చను ప్రయత్నించిన అట్టి ప్రయత్నాలను ప్రభుత్వం ప్రోత్సహిస్తుంది. (1) యుద్ధానంతరం యేర్పడు ప్రజాపరిషత్తు ఏలావుండాలని, ఏయే పద్ధతులపై ఈ పరిషత్తు నిర్ణయాలు చేయాలని, (2) నిర్మాణ చట్టంయొక్క మూలసూత్రాలు, స్వరూపము నిర్మించను అట్టి ప్రయత్నాలు జరగాలి. కాని యుద్ధం సాగినంత వరకు, కేంద్రప్రభుత్వం పునర్నిర్మాణింప బడినదిగనుకనూ, యుద్ధసలహా సంఘం యేర్పడినది గనుకనూ అన్నిపార్టీలు, అన్నిమతాలవారూ, అన్ని శక్తులు ఏకమై ప్రపంచ ఆశయాన్ని రక్షించను, భద్రపఱచను తమసహకారాన్నిచ్చి విజయసాధనకు తోడ్పడుతారని మా విశ్వాసం. అట్టి సహకారాన్ని చూపేప్పుడు యేర్పడే నూతన బంధాలు, నూతన పరిస్థితులు భారతీయులలో నూతన ఐక్యతను, సహనాన్ని, సంప్రదింపులను, గ్రహింపులను పెంపొందించునని నమ్మిక. తద్వారా బ్రిటిష్ పార్లమెంటు, బ్రిటిష్ చక్రవర్తియొక్క ఆశయమైన సుస్థితిని—బ్రిటిషు కామన్వెల్తులో స్వాతంత్ర్య సమాన భాగస్వామ్యాన్ని—ఇండియా పొందగలుగుతుంది."

స్వాతంత్ర్య సముపార్జనకు, ఫాసిజాన్ని యెదుర్కోడానికి భారతీయులు నేడు స్థిరవిశ్చయంతో బలపడియున్నారు. ఈరోజులలో పై ప్రకటన పురోగామికాదుగదా తిరోగామిగానే వున్నదని విశదమైయున్నది. పై ప్రాయి జవాబుపట్ల తమ సంపూర్ణ అనంగీకారమును ప్రకటించుచు కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ 22-8-1940 న వొక తీర్మానాన్ని ప్రకటించింది. ఆనిరాకరణను ధృవపరుస్తూ సెప్టెంబరు 15 న అఖిలభారత కాంగ్రెస్ కమిటీ తీర్మానించినది. గాంధీగారి నాయకత్వాన యుద్ధ సహకారాన్ని అహింసాయుతంగా యెదిరించను ఉద్యమాన్ని ప్రారంభింపమని ఈ సమావేశం సూచించింది.

చాల నెలలవరకు ఇండియా పరిస్థితులలో మార్పేమీ కనబడలేదు. 1941 ఆరంభంలో హిట్లరు బాల్కాన్ రాజ్యాలన్నిటిని (యుగొస్లేవియా,

రుమేనియా, బల్గేరియా, గ్రీస్, అల్బానియా మొదలైనవి) జయించి వశపఱచుకున్నాడు. జూన్ 22 న హిట్లర్ సోవియట్ రష్యాను దండెత్తినాడు. బ్రిటిష్ ప్రభుత్వం భారతీయుల బాగోగులను గమనించకనే యుద్ధ నిర్వహణాన్ని సాగించుతూ వున్నది. వేనవేలు రాజకీయఖైదీలు జైళ్ళలో నున్నారు. ఇండియాయొక్క వైశాల్యము, జనాభాతో సంబంధంలేకుండా, ఇండియాయొక్క అపరిమిత ఆర్థిక సంపదను వుపయోగించుకొనకుండా కొద్దిపాటిగా యుద్ధంలోకి సైనికులను బ్రిటిష్ తాకీదారులు చేర్పించుతూ వచ్చారు.

1940 ఆగస్టులో ప్రకటింపబడి అంతవరకు మూలత్రోయబడిన వైస్రాయిగారి ప్రకటన అమలులోనికి తేబడునని 22-6-1941 న ప్రకటింప బడినది. గవర్నర్ జనరల్ ఎక్సిక్యూటివ్ కౌన్సిల్లో (కార్యనిర్వాహక సభ) కొత్తగా ఐదు సభ్యత్వాలను యేర్పరచారు, ఈ ఐదు సభ్యత్వాలకు ఐదుగురు భారతీయులను నియోగించారు. ఈ ఐదుగురు సభ్యులకు కొత్త పనులు చూపబడినవి. ఈ విషయాన్నిగురించి ఇండియా కార్యదర్శి అమెరీ ఇంగ్లండులోని ప్రజాప్రతినిధి సభలో ఇలా అన్నారు—

''ఇండియా రక్షణకు సాయపడే మునాను, మనమంచి-ఇండియా శ్రేయస్సును గమనించేమునాను తనకార్య నిర్వాహక సభలో చేర్చడానికి ఎన్నో నెలల పర్యంత తెలివితో నాలోచించి కృషిచేసి వైస్రాయి తుదకు ఈ సభ్యులను ఏరుకున్నాడు." ఈ ఐదురుగు ఘనులు ఆ ఐదు సభ్యత్వాలకు నియోగింపబడినారు. మునుపు అనుకున్న యుద్ధసలహా సంఘాన్ని "జాతీయ రక్షణ సంఘం" అనుపేరుతో నారంభించారు.

ఈ నూతన పరిస్థితినిగురించి ఈ దిగువ విషయాలు గమనింపదగినవి—(1) తన కార్యనిర్వాహక సభయొక్క తీర్మానాన్ని చేనినికాని త్రోసివేయను, గమనింపకయే వదలివేయను గల అధికారాన్ని వైస్రాయి

తనచేత నుంచుకున్నారు. ఈ నూతన కార్యనిర్వాహక సభ ప్రజలకుగాని, శాసన సభలకుగాని బాధ్యురాలుకాదు. పైగా ఈ సభ తీర్మానాలు వైస్రాయిని బద్ధుని చేయజాలవు. ప్రభుత్వంలో అత్యంత ముఖ్యమైన శాఖలు— రక్షణ, ఆదాయ—వ్యయం, విదేశ వ్యవహారాలు, రాకపోకలు—భారతీయ సభ్యుల కివ్వకుండా ఆంగ్లేయ సభ్యులపరం చేశారు.*

అందువలన ఈ కార్యనిర్వాహక సభలో ఎక్కువమంది భారతీయులే అయినా, కీలకస్థానాలు వారి అధికారంక్రింద లేకపోవడంచేత ప్రభుత్వంలో వీరి ప్రాబల్యం తక్కువగానే ఉన్నది. వీరు నూతన మార్గాన్ని, నూతన విధానాన్ని సూచించనైనా వీలులేదు. అందువలన భారతీయులు అల్పసంఖ్యాకులుగనున్న పూర్వపుకార్య నిర్వాహక సభకు దీనికి అధికార చలామణిలో భేదమేమీ కనబడలేదు. కొత్తగా నియమింపబడిన ఈ ఐదుగురు సభ్యులలో నెవరుగాని జాతీయ దృక్పథాన్ని, కాంగ్రెస్ దృక్పథాన్ని తెలుపదగిన వారుకారు. వారు ప్రభుత్వంచే నియమింపబడినవారు. ప్రభుత్వం అడుగులకు మడుగులొత్తువారై యుంటారు.

కొత్తగా స్థాపింపబడిన జాతీయరక్షణసంఘం కేవలం సలహా సంఘంమాత్రమే. ఆ సంఘం ప్రతిరెండు మాసాలకొక పర్యాయం సమావేశమౌతుంది. ఏ యే విషయాలపైన, యెలాంటి సలహాను యీ సంఘమివ్వగలుగుతుందన్న విషయం విదితంకాలేదు. కాని ఒక్క విషయం మాత్రం స్పష్టమైనది. ఈ సంఘం సలహాలను వైస్రాయి శిరసావహించవలసిన అవసరంలేదు.

---

* 24—3—1942 న ఈ సభకు తాత్కాలిక సభ్యునిగా ఒక భారతీయుని—సర్ సుల్తాన్ అహమ్మదును నియమించారు. ఈతను రాకపోకల శాఖకు సభ్యుడైనారు.

తర్వాత జరిగిన సంఘటనలలో ముఖ్యమైనది "అట్లాంటిక్ ప్రణాళిక." ఈ ప్రణాళికా ప్రకటనను 12—8—1941 న చర్చిల్, రూజ్‌వెల్టు లిర్వురునూ సంతకంచేశారు. ఈ ప్రణాళిక ఉపోద్ఘాతంలో చెప్పబడినట్లు "ప్రపంచ భావిని మేలుపఱచను మా రెండు దేశాలు కొన్ని ఆశయాలను ఆదర్శంగా నుంచుకొనినవి. ఆ యాశయాలే మా రెండు దేశాల జాతీయ విధానాలలో మార్గదర్శకములుగా నుండగలవు." ఈ ప్రణాళికయందలి యెనిమిది షరతులలో మూడవదానియందు నీ రెండు రాజ్యాల నాయకులు తమ ప్రజలను, దేశాలను ఈ దిగువ వాగ్దానానికి నొడ్డినారు—

> "మానవకోటిలోని యే ప్రజలుగాని తమ యిచ్చవచ్చిన ప్రభుత్వము నేర్పాటుచేసుకొనను హక్కుగలిగియున్నారని, ఆ హక్కును మేము (అమెరికా, ఇంగ్లండు) గౌరవించి, ఆమోదించుచున్నాము. బలవంతం మీద, దురాక్రమణల వలన స్వపరిపాలనను, స్వాతంత్ర్యాన్ని పోగొట్టు కొన్నవారికి మరల వారి స్వాతంత్ర్యం, స్వపరిపాలనలను సమకూర్చవలె వని మా యుద్దేశము."

నియమాలు, షరతులు లేకుండా యీ ప్రకటనలో నొక ప్రాథమిక హక్కు గుర్తింపబడినది. ఈ ప్రకటన చేసినప్పుడు ఇండియాకు నీ ప్రకటన వర్తింపదని యే నిష్కర్ష చేయబడలేదు. ఈ ప్రకటన చేసేప్పుడు మానవసంతతిలో నాలవపాలైన ఇండియాను చర్చిల్‌గాని, రూజ్‌వెల్ట్ గాని మఱచిపోయారనుకోడానికి వీలులేదు. లండన్‌లోని పశ్చిమ ఆఫ్రికా విద్యార్థులకు నుపన్యసిస్తూ, బ్రిటిష్ ఉపప్రధాని క్లిమెంట్ అట్లీ 1941 ఆగస్టు 15 న యిలా అన్నారని 'డెయిలీ హెరాల్డ్' పత్రిక ప్రకటించింది—

"చర్చిల్—రూజ్‌వెల్టులు ప్రకటించిన అట్లాంటిక్ ప్రణాళిక సమకూర్చే లాభాలకు రంగుజాతులవారు, శ్వేతజాతులవారూగూడా భాగస్వాము

లౌతారు." ఇతర విషయాలతోపాటు అట్లీ యీ దిగువ విషయాన్ని విశదపఱచినారు—

"ఈదేశ ప్రభుత్వం తరపున యీ యుద్ధాన్నిగురించి అనేక ప్రకటనలు చేయబడినవి. మేము స్వాతంత్ర్యం, సాంఘికభద్రత కొఱకు పోరాడు చున్నాము. ఇవి మానవసంఘంలోని యేజాతికిగాని నిరాకరింపబడునని మా ప్రకటనలలో నెచ్చటనూ లేదు."

కాని 9—9—1941 న ప్రజాప్రతినిధి సభలో చర్చిల్ యిలా ప్రకటించారు—

"నేనూ, రూజవెల్ట్‌గారు కలిసిచేసిన 'అట్లాంటిక్ ప్రణాళిక' ప్రకటన ఇండియా, బర్మా, బ్రిటిష్ సామ్రాజ్యంలోని యితర భాగాలు-వీటినిగురించి అడప దడప చేయబడిన ప్రకటనలను మార్పజాలదు. మాతోపాటు బ్రిటిష్ కామన్వెల్తులో సమాన భాగస్వామి కావడానికి సహాయపడుదుమని ఇండియాకు 1940 ఆగస్టు ప్రకటన మూలంగా వాగ్దానం చేశాము. కాని యీ మాట చెల్లించుకొనను ఒక షరత్తున్నది. ఇండియాలో అనేకజాతులు, మతాలు, ఇతర శక్తులు ఉన్నాయి. ఇండియాకు మాకు వందల సంవత్స రాలుగానున్న సంబంధాలవలన మా బాధ్యతలు కొన్నియున్నవి. ఆ బాధ్య తలకు అడ్డురాకుండా పై చెప్పబడిన భిన్నశక్తులన్నీ అంగీకరించిన మామా టను చెల్లించుకొనగలము....అట్లాంటిక్ ప్రణాళికను చర్చించినప్పుడు ప్రస్తుతం నాజీ దుష్పరిపాలనకు లోనైన యూరప్‌దేశాల స్వాతంత్ర్యం, స్వపరిపాలన, సహజ జీవనం మాత్రమే మా మనస్సులో నున్నవి.... బ్రిటిష్ సామ్రాజ్యానికి చెందిన ప్రజలలో, దేశాలలో క్రమేణా అభివృద్ధి చెందవలసిన స్వపరిపాలనా విధానానికి నీ సమస్యకు సంబంధంలేదు."

చర్చిల్ నుడివిన పై మాటలను అర్థంచేసుకున్న అట్లాంటిక్ ప్రణాళిక షరతులు ఇండియాకు అన్వయించకుండా చేయడానికి, 1940 ఆగస్టు ప్రకటన స్వరూపాన్ని మార్చను ప్రయత్నించుచున్నాడని విశదమౌతుంది.

ఈ చర్చిల్ మాటలను చదివినపుడు భారతీయుల అసంతృప్తి యెలా వుంటుందో ఊహించుకోవలసిందే.

రష్యాను హిట్లరు దండెత్తినపిదపగూడా కాంగ్రెస్ ప్రాతినిధ్యం వహించిన భారత అభిప్రాయం "భారతీయ స్వాతంత్ర్యం గుర్తింపబడినిది యుద్ధానికి సాయపడము" అని తీర్మానించడం యెందువలననో ప్రజా స్వామ్యవాదులు గ్రహింపను పైచెప్పబడిన సంఘటనలు సాయపడును. కాంగ్రెస్ నాయకులు మరొక మాటగూడా అనవచ్చు — భారత స్వాతంత్ర్యం గుర్తింపబడకుండా యుద్ధానికి తాము సాయపడినా (కాంగ్రెస్ నాయకులు) తమ అనుచరులు తమ్ము అనుసరించరని చెప్పడం న్యాయమే. అట్టి పరిస్థితి మనకు విచారకరంగా నుండవచ్చు. అయిష్టతను కల్గించవచ్చు. యుద్ధంలో సాయపడడానికి ముందుషరతుగా స్వాతంత్ర్య సమస్యను అడ్డుపెట్టకుండా భారతీయులందరూ తమ స్వాతంత్ర్య సమస్యా పరిష్కారానికి తగినచర్య తీసుకున్నా బాగుండునని మనకు అనిపించు తుంది. కాని వారి దృక్పథం మనకు విదితంగాక తప్పదు.

ఇండియాలోని కొన్ని పురోగామికవర్గాలు బ్రిటన్‌లోని సామ్య వాదులవలెనే, హెచ్చుప్రోత్సాహకరమైన దృక్పథాన్ని అవలంబించినవి. ఈ విషయాన్ని రెండు నిదర్శనాలతో నిరూపించవచ్చు. 1941 డిసెంబరులో బొంబాయి రాష్ట్రీయ కార్మిక సంఘం అఖిల భారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్‌కు పంపడానికి ఈ దిగువ తీర్మానాన్ని చేసింది—

> "హిట్లరు ఫాసీజాన్ని యెదిరి గ్రేట్‌బ్రిటన్, సోవియట్ సంయుక్తరాష్ట్రం— అమెరికా సహాయంతో—చేస్తూన్న యీ యుద్ధం ప్రపంచయుద్ధం. దీనిని విభజించను వీలులేదు. ఇండియా ప్రజలుగాని, కార్మికవర్గంగాని యీ యుద్ధాన్ని యికముందు సామ్రాజ్యవాద యుద్ధంగా భావించి యీ యుద్ధానికి వ్యతిరేకంగాగాని, తాటస్థ్యంగాగాని ఉండడానికి వీలులేదు.

"ప్రస్తుత ప్రభుత్వపు యుద్ధప్రయత్నాలపట్లనైనాసరే అఖిలభారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ మునుపటివలె విరోధభావాన్నో, సహాయ నిరాకరణదృష్టినో, లేక తటస్థ విధానాన్నో సాగించను వీలులేదు. ఈ సోవియట్ ప్రజల, బ్రిటిష్ ప్రజలయుద్ధం మనయుద్ధంగూడానని కార్మికులకు విస్పష్టంగా మనం ధైర్యంతో, పట్టుదలతో చెప్పాలి. ప్రజలు కేవలం తమ లాభంకోసమే జయించవలసిన యుద్ధమిది. యుద్ధయత్నాలను వేయిరెట్లు పెంచాలని మా కోరిక.........."

అఖిల భారత విద్యార్థి ఫెడరేషన్‌వారు రెండవ విధర్మనాన్ని సమకూర్చారు. 1—1—1942 న పాట్నాలో జరిగిన సమావేశంలో నొక తీర్మానాన్ని యీ ఫెడరేషన్ 600 వోట్లతో నామోదించింది. ఈ తీర్మానానికి విముఖంగా 9 వోట్లు మాత్రమే వుండినవి. ఈ విద్యార్థి ఫెడరేషన్‌లో అన్ని విశ్వవిద్యాలయాలు, కళాశాలలు, ఉన్నత పాఠశాలలు సభ్యులుగా నున్నవి. ఈ తీర్మానంలోని ఒక భాగం దిగువ నుదహరింపబడినది—

"రష్యాను హిట్లర్ నీచంగా దండెత్తడంతో, జపాన్ నిష్కారణంగా దురాక్రమణ నారంభింపడంతో, ప్రపంచయుద్ధంలోకి అమెరికా దిగడంతో యుద్ధ స్వభావాన్ని సంపూర్తిగా మార్చివేసే సంఘటనలు అనేకం సంభవించినవి. అందువలన యీ ఫెడరేషన్ మార్పును గుర్తించి తానవలంబించవలసిన విధానాన్ని పునరుద్ఘాటించాలి.

"ఫాసీజాన్నెదిరి సోవియట్ నాయకత్వాన సాగుచున్న యీ యుద్ధానికి కేవలం సానుభూతిని ప్రకటించి, నైతిక సహాయాన్ని చూపడంమాత్రం చాలదు. మనం స్వతంత్రుల మయ్యేవఱకు ఏమీచేయజాలమనడం, లేదా ఫలానా ఫలానా షరతుల కంగీకరించనిదే యీ యుద్ధంలో యేమీ చేయమని చెప్పడం తప్పిదమౌతుంది. ఐదు ఖండాల్లో ప్రపంచవిముక్తికై సాగుచున్న ఘోర సంగ్రామం, ప్రస్తుతం మన గుమ్మంముందు జరుగుచున్న యుద్ధం (బర్మాలో) వలన భారతీయులమైన మనం, తలయెత్తి ఐక్యతతో,

ప్రపంచ ప్రజల నుద్దేశించి 'ఈ యుద్ధం ధర్మయుద్ధమని మే మెఱుగుదుము. మేమూ ఈ యుద్ధంలోనున్నాము. ఈ యుద్ధాన్ని జయించను సర్వ విధాలా పాటుపడను నిర్మానించుకున్నాము,' అని చెప్పడానికి మనం ఐక్యంకావాలి."

యుద్ధంలో నుపయోగకరంగా ఇండియా పాల్గొనడానికి వీలయ్యేట్లు చేయను కొన్ని కనీసపు కోర్కెలను ఈ తీర్మానం ఉపపాదించినది. భారత దేశానికి స్వాతంత్ర్య హక్కున్నదని అంగీకరించడం; ఫాసీజానికి విరోధులై కూడా ప్రస్తుతం ఇండియాలోని జైళ్ళలోనున్నవారందరిని వదలివేయడం; ప్రజాస్వామిక హక్కులను స్థాపించడం; కేంద్రంలో బాధ్యతాయుత ప్రభుత్వాన్ని నెలకొల్పడం; భారత పారిశ్రామికాభివృద్ధిని అరికట్టుచున్న అడ్డంకులన్నిటిని తొలగించడం; శ్రామికుల జీవిత విధానాన్ని మేలుపరచడం మొదలైనవి ఈ కొర్కెలలో నిమిడియున్నవి.

ఈ తీర్మానం "ప్రభుత్వాన్ని బెదరించను చేయబడినదికాదు. ఇది కేవలం ఆచరణయోగ్యమైన కార్యక్రమము. జాతీయ స్వాతంత్ర్య పథకమిది" అని విశదీకరింపబడినది. "మేము చరిత్రను మోసగింప దలచు కొనలేదు. చరిత్రను సృష్టింపదలచినాము. 'ఈ మా కోర్కెలను మీరు మా కనుగ్రహించండి. మేము మీ యుద్ధంలో పాల్గొంటాము' అని మేమనడంలేదు. ఇది బ్రిటిష్ అభివృద్ధి నిరోధకుల యుద్ధంకాదు. ఇది మన యుద్ధం'' అని యీ తీర్మానంలోని ముగింపుమాటలు.

పై విషయ చర్చనుబట్టి ఇండియా ప్రజలు బ్రిటిష్ ప్రజలకు సహాయంగా విలబడగలరా? యని, విలబడుదురా? యని అణుమాత్రమైనా సందేహింప నవసరంలేదు. కాని ముందువారి జాతీయవాంఛలనుగురించి సంతృప్తికరమైన సమాధానం కుదరవలెను. మనతోపాటు భారతీయు

లందరూ యేకమై యీ యుద్ధంలో యేకైక ఆదర్శంకొఱకు పోరాడుదురు. వారి ఆసక్తులకు, సానుభూతికి మన ఆసక్తులకు, సానుభూతికి నొద్దిక గూడా కుదరగలదు.

---

# 5. పరిష్కారం అతిత్వరలోనే కావాలి

బ్రిటన్‌లోని ప్రజాభిప్రాయం భారతీయ సమస్యలపట్ల కొద్దిపాటి ఆసక్తిగాని చూపదు. యుద్ధకాలంలో భారతదేశంలోని పరిస్థితులేమిటో మన ప్రజలు తెలుసుకునే మార్గాలుకూడా మూసిపోయినవి. అటులుండి గూడా యిటీవల కొద్ది మాసాలుగా ఇండియాలోని పరిస్థితులపట్ల యెంతో ఆసక్తిని బ్రిటిష్ ప్రజలు చూపించుచున్నారు. బ్రిటిష్‌పాలకులగతిపట్ల దేశ ప్రజల నిరసనం, నిర్లక్ష్యభావం యెలా ఉండేది, బ్రిటిష్ ప్రజలు మలయాలోనూ, సింగపూరులోనూ, యిటీవలనే బర్మాలోనూ జరిగిన సంఘటన లనుబట్టి గ్రహించారు. యుక్తిపరుడై, శక్తి సామర్థ్యాలుగలిగిన జపాన్ వంటి విరోధితో సాయపడని ప్రజలమధ్యనుండి యూరోపియన్ సైన్యాలు పోరాడడం యెంతభారమో మన ప్రజలు తెలుసుకోగలిగారు. ఫిలిప్పైన్ దీవులలో అమెరికన్‌ల పరిస్థితులతో బర్మా, మలయాలలోని మన దుస్థితిని మన ప్రజలు పోల్చుకోగలిగారు. అదే విరోధిని (జపాన్‌ను) ఫిలిప్పైన్ దేశస్థులు ధృఢవిశ్వాసంతో నెదిరి పోరాడడానికి కారణం వారిలో చాల వరకు స్వపరిపాలనా విధానాన్ని అమెరికా పెంపొందచేసి, దేశ పరిపాలనను వారిచేత బెట్టడమే. పైగా, "యిన్ని యేండ్లలో నిష్కర్షగా మీకు

స్వాతంత్ర్య మిస్తాము'' అని అమెరికా విస్పష్టంగా వాగ్దానం చేసింది.* అందువలననే ఫిలిప్పైన్ ప్రజలు జపాన్‌ను యెదుర్కొడానికి యెంత కాలమైనా సాయపడను సిద్ధపడినారు. ఈ విషయాన్ని పోల్చిచూచుకొని మన ప్రజలు ఈ వ్యత్యాసాన్ని, తత్ఫలితాన్ని గ్రహించగలిగారు. పైగా, చైనాలోని పరిస్థితులతోగూడ మలయా, బర్మా, సింగపూరుల పరిస్థితిని పోల్చుకున్నారు. చైనాలో యెన్నో యేండ్ల పర్యంతం ప్రజలు తమనేల, తమ స్వాతంత్ర్యంకోసం అన్ని యిక్కట్టులను అధిగమించి, సరఫరాలు లేకున్నా, ఆయుధ సంపత్తి తగ్గినా, ఉత్పత్తివిధానం క్షీణించినా తమ ప్రజా ప్రభుత్వం నీడను ధైర్యంతో, పట్టుదలతో పోరాడగలిగారు. ఈ విషయాన్నిగూడా మన ప్రజలు గ్రహించగలిగారు సోవియట్ సంయుక్త రాష్ట్రింలోని స్వాతంత్ర్య ప్రజలు జర్మను ఫాసీజాన్నెదిరి సలుపుచున్న తీవ్ర పోరాటాన్ని ఇండియా, బర్మా, సింగపూరు, మలయా ప్రజల పోరాటంతో మన ప్రజలు పోల్చుకోగలిగారు.

ఈ పోలికలవలన మనం నేర్చుకోగల గుణపాఠం విదితమే. ఇండియా కోర్కెలను మనం సంతృప్తిపరచక, ఇండియాలోని అసంతృప్తి నల్లేయించినంతవఱకు, మన యుద్ధ ప్రయత్నాలకు భారతీయులు విరోధులుగానో, విముఖులుగానో ఉన్నంతవఱకు ఇండియాను మనం జపాన్ దురాక్రమణమంచి రక్షించడంలో కృతకృత్యులం కాలేము. అలాగాకుండా, భారతీయ కోర్కెలను సంతృప్తిపరచినవెంటనే యీ యుద్ధంలో సాయపడడానికి భారతీయులు ఉత్సాహవంతులౌతారు. అప్పుడు

---

* ఫిలిప్పైన్ పార్లమెంటులో (నేషనల్ అసెంబ్లీ) సభ్యులందరూ ఫిలిప్పీనోలే. వీరందరూ ప్రజలచే యెన్నుకొనబడినవారే. దేశపరిపాలనా విధానంలోని సర్వాధికారం యీ సంస్థచేతనున్నది. ఈ పార్లమెంటు అధ్యక్షుడు ఎన్నుకొనబడినవాడే, అతడుగూడ ఫిలిప్పీనోయే.

ఇండియాలో పరిశ్రమల అసమర్థతగాని, సైన్యంలోకి మనుష్యుల చేర్పడంలో ఇంతవరకు ప్రదర్శింపబడిన విలంబన, అనుమానంగాని అడ్డురాకుండా దురాక్రమణ నెదుర్కొనడానికి అపార బలసంపన్న సంయుక్త ప్రతిఘటనాశక్తిని నిర్మింప వీలౌతుంది.

ఇంకా పెద్దెత్తున మిలిటరీ అపజయాలు మనకు సంప్రాప్తించకుండా తప్పించుకోడానికి, ఏలాగైనా భారతీయులలో నెక్కువమందిని జపాన్‌వారి దురాక్రమణ, దండయాత్రల ఫలితంగా సంభవింపనగు నరకయాతవలనుండి తప్పించడానికి, జపాన్ ఫాసీజపు పతనాన్ని ప్రారంభింపడానికి భారతీయులలో హెచ్చుమందిని యుద్ధ వ్యతిరేకతనుండి, యుద్ధం పట్ల తాటస్థ్యభావంనుండి మనకు సాయపడే మిత్రులుగా మార్చవలెను. ఏది యెట్లున్నా యీ ఆశయాన్ని సాధించను మన మేమి చేయాలో విశదమే. భారతీయుల కోర్కెలను గుర్తించి ఆమోదించడమే మన కర్తవ్యం. మన బాధ్యతను నిర్వహించను కాలవ్యవధి యింకా ఎంత యున్నదో మనకు తెలియదు. చాలకాల వ్యవధి ఉండవచ్చు. కాని ప్రస్తుతం వలె వృధాపుచ్చామంటే కాలాతీతం కావచ్చు. కాలపరిమితిని, భారతీయాశయసంతృప్తిని మననంచేసుకొనిన సర్ స్టాఫర్డ్ క్రిప్సును కెయిరోలో కొద్దిరోజులు గడపమనడంగూడా పొరబాటే.

---

# 6. పరిష్కారానికి అవకాశం

పరిష్కారావశ్యకత చాల యెక్కువ అని యింతకుముందే గమనించాము. దానివలన లాభాలు ఇంతయని చెప్పనలవికాదు. కాని పరిష్కారానికి ముఖ్యషరత్తు విస్పష్టంగా, మరల తప్పుకోడానికి వీలులేకుండా

భారతీయ స్వాతంత్ర్యాన్ని గుర్తించడం. కాని యీమాత్రంచేతనే పరిష్కారం చేకూరదు. అంటే, మన రాజనీతి అంతచేతగానిదని యెవ్వరూ అనరు. వాస్తవికాలపై నాధారపడి, పరిష్కారమార్గంలోని సాధక బాధకాలను ఆలోచించాలి. రెండువందల సంవత్సరాలపాటు ఒక విదేశ ప్రభుత్వం (ఇంగ్లండు) కేవలం స్వలాభంకోసం ఒక దేశాన్ని (ఇండియాను) పాలించడం; ఈ రెండు శతాబ్దాలలో తన అధికారాన్ని బలపరచుకొనను కృత్రిమ సమస్యలన్నిటిని సృష్టించి, లేవదీసి, బలపరచడం, పరిపాలింపబడిన ప్రజలు బలపడకుండా ఎన్నెన్నో అడ్డంకులు గల్పించడం; పైగా అప్పుడప్పుడు సంస్కరణలవి అధికారాన్ని అంటకుండా ఏవేవో బులుబూచి మార్పులనుచేసి పరిపాలనా యంత్రాన్ని చీకాకుపఱచి, అనవసర కష్టాలు కలిగించి, ప్రజల ఆశలను భంగపఱచడం; మొదలైన గతచర్యలుకారణంగా ఎన్నోసమస్యలు ఈ పరిష్కారానికి అడ్డుపడక మానవు. బ్రిటిష్ ఆధిపత్యం ఇండియాలో సాగితే ఎక్కువ లాభాలను పొందే బ్రిటిష్ సామ్రాజ్యవర్గ పరిష్కారానికి విరుద్ధంగాచేసే వాదనలను కొంతవఱకు మనం త్రోసిపుచ్చినా, నిజమేమిటో కనుగొనడానికి మనం తీర్మానించుకోవాలి.

సాధారణంగా పరిష్కారానికి అడ్డంకిగా సూచింపబడే ప్రధానసమస్య హిందువులకు, మహమ్మదీయులకుగల మత వ్యత్యాసమూ, వైషమ్యమూనూ. ఈ మత సమస్యనుగుఱించి ఇంతకుపూర్వమే క్లుప్తంగా గమనించాము. ఈ సమస్యనుగురించి సత్యం ఏమిటో కొంత స్పష్టపడలేదు. కాని ప్రాధాన్యంగా ప్రస్తుత నిజపరిస్థితిని వర్ణించి, సామాన్యంగా ప్రచారకులు చెప్పే కథనంతో పోల్చిచూడవచ్చును.

ప్రచారకుల కథతో ప్రారంభించుదాం. "మహమ్మదీయులు ఇండియాలో 8 కోట్లు ఉన్నారు. వీరందరూ ఏక మతమునకు చెందిన

వారని గుర్తెరిగి అందరూ ఐక్యతతో ఒక మతసంఘంగా నున్నారు. వీరికీ హిందువులకూ గిట్టదు. వారిమతం వేరు.[1] ముస్లింలమతం వేరు. హిందువులు వీరికి మూడింతలు—25 కోట్లు ఉంటారు. ఈ రెండు మతాలవారూ పరస్పరం విరోధభావం కలిగియున్నారు. వీరు పరస్పరం ద్వేషంబూని కీడు కోరుచునేయున్నారు. కాంగ్రెస్ కేవలం హిందూసంస్థ. ముస్లింలీగ్ వాస్తవంలో ముస్లింలందరి ప్రతినిధి సంస్థగా నున్నది." ఈ వాదనను బట్టి భారతదేశంలోని స్వాతంత్ర్య స్థాపనకు ఆచరణయోగ్యమైన మార్గమేదీలేదని మనం అనుకోవాలి. అల్పసంఖ్యాకులైన ముస్లింల హక్కులను రక్షించను తృప్తికరమైన రక్షణలు కల్పింపలేము గనుక బ్రిటిష్ పరిపాలన యథావిధి సాగవలసినదేనా ? కాని ముస్లింలీగ్, దాని అధ్యక్షుడైన జిన్నాగారు ఈ వాదన నొప్పుకొనరు. హిందువులకన్న మహమ్మదీయులు హెచ్చుసంఖ్యలోనున్న అనేక రాష్ట్రాలు (వాయవ్య సరిహద్దు రాష్ట్రము, పంజాబు, సింధు, బెలుచిస్థానము, అస్సాం, బెంగాలు) చేరి ప్రత్యేక ముస్లింరాజ్యం కావాలని, ఈ నూతన ముస్లింరాజ్యం మిగిలిన ఇండియా రాష్ట్రాలనుండి సంపూర్ణంగా స్వతంత్రించి ఉండాలని వారి వాదన. ఈ ఊహాప్రాయమైన స్వతంత్ర ముస్లింరాజ్యానికే 'పాకిస్థాన్' అని పేరుబెట్టారు.

కాని వాస్తవిక పరిస్థితులు కేవలం భిన్నముగా నున్నవి. ప్రచారకుల పై వర్ణనకు వాస్తవ పరిస్థితులకు ఎంతో వ్యత్యాసముంది. హిందువులకు ముస్లింలకు తప్పనిసరియైన ప్రధానవిరోధ మేదీలేదు. అట్టివిరోధముండడానికి ఆర్థికపునాది ఏదీగాని లేదు. రెండుమతాలవారు సంపద, పేదరికము అన్న సమస్యల నెదుర్కొనవలసి యున్నది. రెండు మతాలవారు భూస్వాములుగానూ, రైతులుగానూ; పీడించువారుగానూ, పీడింపబడువారుగానూ; యజమానులుగాను, కూలీలుగానూ; వడ్డీ వ్యాపారులుగను, ఋణ

గ్రస్థులుగనూ ఉన్నారు. మతకలహాలు, తగాదాలు వస్తూయున్నవి. కొన్ని సమయాల్లో ఇతరులే కలహాలకు కారకులు. ఈ తగాదాలను, కలహాలను బ్రిటిష్ పరిపాలన రూపుమాపలేదు. ఈ కలతలన్నీ కేవలం ఈ శతాబ్దంలో ప్రారంభమైనవే. ఇండియా భారతీయుల పరిపాలనకు లోనైయున్న ఈ మత కలహాలు అంతరించునని విశ్వసించడానికి మంచికారణమున్నది. హిందువులు, ముస్లింలు ఇతర మతాలవారు కలసియున్న స్వదేశ సంస్థానాలలో హిందూ—ముస్లిం మత కలహాలు మచ్చుకైనా కానరావు. కార్మికసంఘాలలోను, కార్మికోద్యమంలోనూ శ్రామికులందరి మేలుకొఱకు ఏర్పడు ఐక్యతవలన మతకలహాలు మాయమై పోతున్నవి. మతసమస్యలను కృత్రిమ కారణాలను తీవ్రంగా ఖండిస్తూ పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ ఇలా అన్నారు.



పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ

"అధికారవర్గం, ధనికవర్గం, భూస్వాములు కేవలం తమ ఆస్తిపాస్తులను రక్షించుకోను లేవదీసిన సమస్య మతసమస్య. ఆస్తికులు ఎల్లప్పుడూ మతాన్ని స్వలాభానికి ఉపయోగపెట్టుకుంటూనే ఉన్నారు. ధనికవర్గానికి, జమీందారీవర్గానికి చెందినవారు మార్పును నిరోధించుతారు. అందుకుగాను బ్రిటిషు సామ్రాజ్యం అండజేరి దానికి సాయపడుదురు. బ్రిటిషు ప్రభుత్వం ప్రజాస్వామ్యాన్ని, స్వాతంత్ర్యాన్ని, మఱి ఏ యితర పెద్దమార్పును నిరో

ధించను మహా సంతోషంతో మత సమస్యను ఉపయోగించుకొనుచున్నది. తద్వారా బ్రిటిషు సామ్రాజ్యవాదం ఇండియాలో తన అధికారాన్ని, ప్రత్యేక హక్కులను నిలబెట్టుకొన ప్రయత్నించుచున్నది. ఇండియాలో మతసమస్యకు కారణం ఇదే."

కాంగ్రెస్ ఈ ప్రచారకు లనునట్లు హిందూసంస్థకాదు. ముస్లిం లీగ్ ముస్లింలలో హెచ్చుమంది ప్రతినిధి సంస్థాకాదు. కాంగ్రెస్ తన సభ్యుల లెఖ్కను మత భేదాన్నిబట్టి తయారుచేయడంలేదు. కాంగ్రెస్ విధానంలో నమ్మకమున్న ప్రతివ్యక్తీ సాలుకు పావలా చందాకట్టిన కాంగ్రెస్ సభ్యుడు గావచ్చును. కాని ఈ పావలా కట్టలేనివారు ఇండియాలో కోట్లమంది ఉన్నారు. కాంగ్రెస్ సభ్యులెవరు తమ మతమును చెప్పుకొనవలసిన అవసరం లేదు. కావి కాంగ్రెస్‌వారిని ఖైదులోనుంచినప్పు డొక మారు కాంగ్రెస్ ఖైదీలలో ముస్లింలు 20%కు ఉన్నారని నిరూపింపబడినది. అందువలన కాంగ్రెస్ సభ్యులలో ముస్లింలు 20% తగ్గుతారనిగాని, హెచ్చుగా



మౌలానా అబుల్‌కలాం ఆజాద్

వుంటారనిగాని అనుకోడానికి వీలులేదు. ఇండియాలోని జనసంఖ్యలో

హిందూ ముస్లింల నిష్పత్తి 3 : 1. కాంగ్రెస్ సభ్యులలో ముస్లింల నిష్పత్తి 5 : 1. అనగా జన బాహుళ్యంలో ముస్లింల నిష్పత్తికి కాంగ్రెస్‌లోని ముస్లింల నిష్పత్తి తక్కువ అని అర్థము. ప్రస్తుతం కాంగ్రెస్ అధ్యక్షులు మౌలానా అబూల్‌కలాం ఆజాద్ ముస్లిమే. వాయువ్య సరిహద్దు రాష్ట్రంలో 90% ప్రజలు ముస్లింలే. ఈ రాష్ట్రం కాంగ్రెస్ పరిపాలనక్రిందనున్న రాష్ట్రం. ప్రస్తుత సింధు, బెంగాల్‌రాష్ట్రాల ప్రధానులు ముస్లింలీగ్‌తో ఏకీభవించడంలేదు. ఈ ప్రధాను లిద్దరు కాంగ్రెస్ వైఖరిని అవలంబించి ఏకైక స్వాతంత్ర్య భారతదేశాన్నే తమ లక్ష్యంగా పెట్టుకున్నారు. ముస్లింలు బహుసంఖ్యాకులుగ నున్నరాష్ట్రం మరొక్కటే మిగిలింది—పంజాబు. ఈ రాష్ట్ర ప్రధాని జిన్నాగారితో వ్యతిరేకించాడు. ఇండియా విభజన కీయన విముఖుడు.

ముస్లింలీగ్ విషయమేమిటో పరిశీలించుదాం. ముస్లింలీగ్ ఒకచిన్న సంస్థ. కాని అతిచురుకుగా పనిచేస్తూవుంది. ఈ సంస్థ అధ్యక్షుడు జిన్నాగారు, ఈయన చాలా కార్యచతురుడు. ముస్లింలీగ్ తన సభ్యుల సంఖ్యను ప్రకటించుటలేదు. కాని ముస్లింలందరికీ తానే ప్రాతినిధ్యం వహించానం టుంది. కాంగ్రెస్‌లోని ముస్లింబలాలను, ముస్లింరాష్ట్రాలలో కాంగ్రెస్‌కు గల మద్దతును ఇంతకుముందే గమనించాం. ఇక ముస్లిం జనసామాన్యం విషయమేమిటి? ముస్లింలలో రెండు మత విభాగాలున్నాయి—సున్నీలు, షియాలు. షియాలు మొత్తం ముస్లింల జనాభాలో 20% ఉంటారు. వీరందరూ ముస్లింలీగ్‌కు వ్యతిరేకులు. వీరుగాక మొమిన్లు అను మఱియొక తెగవారున్నారు. ఈ తెగ కేవలం మతవిభాగానికి చెందినదికాదు. వృత్తిని బట్టి ఏర్పడిన తెగయిది. కాని మొమిన్లందరూ ముస్లింలే. ఈ తెగవారు 4,50,00,000. వీరిలో కొందరు షియాలుగూడా ఉన్నారు. ఈ మొమిన్లందరు కాంగ్రెస్ అనుచరులే. కనుక జిన్నాగారు తన్ను అనుసరించే

వారని చెప్పుకొనగలిగిన వారిలో మొమిన్లు లేరు: షియాలూలేరు; వాయవ్య పరిహద్దు రాష్ట్రవాసులులేరు; ప్రస్తుతం సింధు, బెంగాల్, పంజాబ్ రాష్ట్రాల ప్రధానుల పలుకుబడి కిందనున్నవారూ లేరు. కాంగ్రెస్ అనుయాయులలో 20% అయిన ముస్లిం కాంగ్రెస్‌వారూ లేరు. ఇక వీరంతాబోతే జిన్నాగారి అనుచరవర్గంగా మిగిలే ముస్లింల సంఖ్య చాలకొద్ది. ఈ కొద్ది మందైనా అందరూ ఆయన ననుసరిస్తారని రూఢియేమున్నది ? 1937 లో జరిగిన శాసన సభల ఎన్నికలలో నివ్వబడిన మొత్తం ఓట్లలో లీగ్ అభ్యర్థులకువచ్చిన ఓట్ల మొత్తం 5% తక్కువవడంలో ఆశ్చర్యమేమున్నది ? తర్వాత జిన్నాగారి అధ్వర్యాన్ని ప్రశ్నిస్తూ లీగ్‌లో కొన్ని కలతలు ఏర్పడినవి. ఈ కలతలకు పూర్వమే 5% ఓట్లుమాత్రమేవస్తే తర్వాత పరిస్థితి యెలా వుంటుంది ?

ముస్లింలీగ్ 'పాకిస్థాన్' కావాలంటున్నది. ముస్లింలు బహుసంఖ్యాకులుగా నున్నచోట్ల ప్రత్యేక ముస్లింరాష్ట్రాలు స్థాపింపబడవలెనని 'పాకిస్థాన్'కు అర్థం. ఈ కోర్కె కేవలం ఇటీవల ప్రారంభమైనది. ఇది అంత ఉపయుక్తమైన ఆశయమనిచెప్పడానికి వీలులేదు. * ఈ 'పాకిస్థాన్'

---

* జెకొస్లొవేకియాను హిట్లరుకు ఆహుతిచేయను అచ్చట స్థిరనివాసము లేర్పరచుకొనిన జర్మనులు 1938 లో తమకు స్వాతంత్ర్యం కావాలని ఆందోళన చేశారు. దీనినే సుడేటన్ సమస్య అంటారు. ఇంగ్లండు ఒత్తిడిపై సుడేటన్ జర్మనులు జెకొస్లొవేకియాలో స్వతంత్ర రాష్ట్రాన్ని నెలకొల్పడానికి ప్రభుత్వం అంగీకరించింది. తద్వారా జెకొస్లొవేకియాను తర్వాత హిట్లర్ సులభంగా కబళింప గలిగాడు. ఈ హిట్లరు ఎత్తుననుసరించే జిన్నాగారు "పాకిస్థాన్"ని నాదాన్ని లేవదీశారని 1942 లో ఆచార్య గురుముఖ్ నిహాల్ సింగ్‌గారు తమ లాహోరు ఉపన్యాసంలో విశదపరిచారు.

ఆశయాన్ని ముస్లింలలో హెచ్చుమంది అంగీకరించలేదు. పైగా ఈ ఆశయానికి ఆధారం అత్యంత అభివృద్ధినిరోధకమైన మతవ్యత్యాసమే. 'పాకిస్థాన్' అనగానే నా మనస్సుకు ఐర్లండు విభజనవలన కలిగిన దుఃఖభాజనమైన అనుభవాలు జ్ఞప్తికివచ్చును. ఇట్టి దేశవిభజన ఆర్థికనాశనానికి దారితీస్తుంది. దేశవిరోధులైన సామ్రాజ్యవాదులకు 'పాకిస్థాన్' కోర్కె ఎక్కువగా ఉపయోగపడుతుంది. ఇండియా ఒకజాతికాదని వారనడానికి అవకాశమిస్తుంది. ఈ 'పాకిస్థాన్' ఆశయానికి ఉత్తమోత్తమమైన జవాబును మరొక ముస్లింసంస్థయే ఇచ్చినది. ఆలిండియా అజాద్ ముస్లిం కాన్ఫరెన్సు (అఖిలభారత స్వాతంత్ర్య ముస్లిం సమావేశము) అనేక లక్షల ముస్లింలకు ప్రతినిధి సంస్థ. ప్రస్తుతం బెంగాలు, సింధురాష్ట్ర ప్రధానులుగూడ ఈ సంస్థలో సభ్యులుగానున్నారు. 1940 ఏప్రిల్ 30 న ఈ సభ ఢిల్లీలో సమావేశమై ఈ దిగువ తీర్మానాన్ని చేసింది—

"భూగోళ, రాజకీయ సరిహద్దులనుబట్టి ఇండియా ఒక్కదేశం, ఒక్క భూభాగం. అందువలన జాతి, మత భేదములేకుండా ఇండియా భారతపౌరులందరి మాతృభూమి. భారతీయులందరూ భారతదేశ సంపదకంతకు భాగస్వాములు. భారతదేశంలోని ప్రతిమారుమూల ముస్లింల పుణ్యస్థలాలు, పవిత్రస్థానాలు ఉన్నాయి. ముస్లిం మత, చరిత్ర, సంస్కృతి కాధారాలు, తార్కాణాలు అయిన శిధిలాలు దేశమంతట ఉన్నవి. ఈ శిధిలాలు ముస్లింలకు వారి ప్రాణాలకన్న ప్రియతమమైనవి.

"ఇండియాలోని మహమ్మదీయుడు నిస్సందేహంగా భారతీయుడే. ఇతర భారతీయులందరితోబాటు మహమ్మదీయునకుగూడ ప్రతిచోటను, ప్రభుత్వ, ఆర్థిక తదితర జాతీయ జీవిత విధానాలయందు సమాన హక్కుగలదు. అందువలననే, ఇతరు లందరితోబాటు మహమ్మదీయులకుగూడ దేశస్వాతంత్ర్య సముపార్జనకు శ్రమపడవలసిన, త్యాగము చేయవలసిన బాధ్యత కలదు......"

పై తీర్మానంయొక్క అర్థం సువిదితమే. తాత్కాలికంగా కొంత కాలానికి మహమ్మదీయులు భారతదేశంలో అల్పసంఖ్యాకులు గనుక వారికి ప్రత్యేక అల్పసంఖ్యాక రక్షణలను నిర్మాణ చట్టంలో నేర్పరుపవచ్చును. కాని భారతీయ ఐక్యత, స్వాతంత్ర్యాలకు వారు అడ్డురారాదు. అభివృద్ధి నరికట్టను ముస్లింలకు అధికారం, అవకాశం ఇవ్వగూడదు.

స్వదేశ సంస్థానాధీశుల ప్రత్యేకవ్యవస్థ విచారింపతగినది. '1935 ఇండియా ప్రభుత్వచట్టం'లో నుపపాదింప బడినట్లు బ్రిటిష్ ఇండియాతో ఫెడరేషన్‌లో చేరడానికి సంస్థానాధిపతులు కొంత ఇష్టపడినారు. అందువలన ఇప్పుడు వారిని ఫెడరేషన్‌లోనికి తేవడంలో అట్టి కష్టమేమీ వుండదు. సంస్థానాధీశులవలెనే. ఇతర మతాలవారిని—హరిజనులు మొదలైనవారిని—ఫెడరేషన్‌లో చేర్చడానికి మనం దాటలేని అడ్డంకులేవీలేవు.

అత్యంత పేదఱికము, పారిశ్రామికాభివృద్ధి నరికట్టడం, పట్టణ—పల్లె జీవితాలకు పొందిక లేకపోవడం మొదలైన పరిస్థితులవలన ఏర్పడిన సమస్యలు స్వాతంత్ర్య స్థాపనకు అడ్డంకులు కాజాలవు. ఈ సమస్యలన్నిటికి చాలవఱకు బ్రిటిష్‌పాలన యేకారణము. బ్రిటిష్ పరిపాలన ఈ సమస్యలను మాన్పలేదని, పరిష్కరించలేదని రూఢిగా చెప్పవచ్చు. ఈ సమస్యలు స్వతంత్ర భారత జాతీయ ప్రభుత్వంచేత సులభంగా, స్థిరంగా పరిష్కరింప బడగలవు. సోవియట్ సంయుక్తరాష్ట్రం అనుభవాలే ఇందుకు నిదర్శనం.

ప్రస్తుతం ఇండియా నుంచి సాలీనా బ్రిటనుకు సుమారు రూ 300,00,00,000 రాబడియున్నది. ఈ రాబడి నిలిచిపోయిన బ్రిటిష్ శ్రామికుని వరుంబడి తగ్గిపోతుందని కొందఱిభయం. ఇది ఒక వాదనయే కాదు. భారతదేశంలోని తనవంటి శ్రామికులను దోచుకోడానికి బ్రిటిష్ శ్రామి

కునకు, నైతికంగా ఏ హక్కులేదు. నిజంలో భారత శ్రామికుని దోచుకోవాలన్నకోర్కె బ్రిటిష్ శ్రామికునకులేదు. అట్టి దోపిడిని బ్రిటిష్ ధనికవర్గం సాగిస్తున్నా అందులోభాగం పొందాలన్న కోర్కెగాని అతనికిలేదు. అంచనాలప్రకారం ఈ దోపిడిలో ఇంగ్లండులోని ప్రతిశ్రామికునకు సగటున రోజుకు రెండణాలు ముట్టుతుంది. ఈ రెండణాలైనా ఇంగ్లాండులోని ధనికులతో సమానంగా పంచుకుంటేనే. కాని, ఇంగ్లండులోని ధనికులు ఈ దోపిడిలో శ్రామికునకు సమానభాగం ఇవ్వడంలేదు—ఇవ్వరుగూడానూ. * భారతదేశం స్వాతంత్ర్యాన్నిపొంది, అభివృద్ధిచెందిన ఇంతదనుకకన్నా హెచ్చుగా మనతో వ్యాపారం చేయగలుగుతుంది. వ్యాపారాభివృద్ధి ఫలితంగా బ్రిటిష్ ప్రజలు తమ ఆర్థిక విధానాన్ని అభివృద్ధిచేయవచ్చు. ఆసియాఖండంలోని తమ సోదరప్రజల దోపిడిలో రోజు 1-కి రెండణాలచొప్పున భాగం పొందడానికన్నా హెచ్చు ఆదాయాన్ని బ్రిటిష్ శ్రామికులు తమ ఉత్పత్తివిధానాన్ని, ఆర్థిక వ్యవస్థనుమార్చి తద్వారా పొందగలరు.

భారత సమస్యా పరిష్కారానికి దాటలేని అడ్డంకులున్నవనడం అసత్యం. భారతసమస్యా పరిష్కారం కష్టమన్నమాట నిజమే. ఎంతో రాజకీయ చతురత, నిపుణతకావాలి ఆ పరిష్కారానికి.

---

* ఇవ్వవలెనని రచయితకోర్కెకాదు.

# 7. పరిష్కారానికి పునాది

పరిష్కారానికి ముఖ్యమార్గం భారతస్వాతంత్ర్యాన్ని గుర్తించడమే నన్న విషయం సువిదితం. అల్పసంఖ్యాకులకు సరియైన రక్షణలు కల్పించడం అవసరం. ప్రజాస్వామ్యపద్ధతులపై ఎన్నుకొనబడిన ప్రజాపరిషత్తు భారత భావిరాజకీయ జీవితపునాదులను వివరంగా తీర్మానించవలెను. అట్టి పరిష్కారమార్గం చిక్కులతో నిండియున్నదన్న విషయం విశదమే. కాలాతీతమౌతూఉంది. ఆలస్యంలేకుండా వెనువెంటనే స్వాతంత్ర్యాన్ని సమకూర్చి, ఆ స్వాతంత్ర్యం భారతీయుల అనుభవానికి అందేటందుకు మార్గాలను వెంటనే సృష్టించాలి. అప్పుడుగాని చాల ఆతురతతోనున్న భారతీయులను తృప్తిపఱచినవారము గాము. ఇట్టి ప్రయత్నాలు వెంటనే జేసిన గాని భారతప్రజల సానుభూతిని ఈ యుద్ధానికి పొందజాలము.

పైన గమనించినట్లు భారత రాజకీయాల్లో కాంగ్రెస్‌పార్టీ ప్రధాన స్థానాన్ని ఆక్రమించియున్నదన్న విషయాన్ని మన మంగీకరించిన పరిష్కార ప్రయత్నానికి రాయబారాలు కాంగ్రెస్‌తోనే ప్రారంభింపాలి. పరిష్కారమార్గాని కనువైన యంత్ర సామగ్రినిగురించి కాంగ్రెస్‌తోనే సంప్రదించాలి. భారత దేశమంతటా ఎన్నికలు ఇటీవల జరుగలేదుగనుక కాంగ్రెస్‌ను మించిన భారతప్రజల ప్రతినిధిసంస్థ మఱేదీ లేదు. కాంగ్రెస్‌తప్ప మరి ఏ ఇతర సంస్థగాని—ముస్లింలీగ్ అయినా సరే—ఏ ముఠాకో ప్రతినిధిగా నుంటుందిగాని, కాంగ్రెస్ ఆమోదించిన పరిష్కారమార్గాన్ని త్రోసిపుచ్చను అర్హతకలిగియుండదు. కాకున్న, అట్టిసంస్థ ప్రాతినిధ్యంవహించే ముఠాకు, లేక అల్పసంఖ్యాక వర్గానికి ప్రత్యేకరక్షణలను కల్పించదగును. కాంగ్రెస్‌తోబాటు ఇతర సంస్థలు అంత్యతీర్మానంలో ఎన్నిపాల్గొంటే అంత

మేలు. అనేక సంస్థలు కాంగ్రెస్‌తోబాటు పరిష్కారమార్గాన్ని తీర్మానించ డంలో పాల్గొనడం అనేకవిధాల ఉపయోగకారి కాగలదు. కాని కాంగ్రెస్‌తో రాజీపడడం తప్పనిసరియని మనం గుర్తుంచుకోవాలి.

బ్రిటిష్ ప్రభుత్వం, కాంగ్రెసు రాజీకి సిద్ధపడడం అదృష్టమే. పరిష్కారం కొఱకు ఇంతకుపూర్వంకన్నా నేడు హెచ్చు ఆతుర్దా, ఉత్సాహం ఇరువైపుల కనబడుచున్నవి. అందువలన పరిష్కారానికి దారితీసే మార్గాలను కనిపెట్టడం సులభం; సాధ్యంకూడానూ. అట్టిమార్గాలను కొన్నిటిని కాంగ్రెస్ ఇప్పటి కప్పుడే కనుగొన్నదికూడాను.

కాంగ్రెస్ తన ఆశయాన్ని చాలకాలంక్రితమే స్పష్టపరిచింది. స్వతంత్ర భారతదేశంయొక్క నిర్మాణచట్టాన్ని నిర్మించను ప్రజాస్వామ్య పద్ధతులపై ఎన్నుకొనబడిన ప్రజాపరిషత్తును సమీకరించవలెనని కాంగ్రెస్ కోరుచున్నది. స్వాతంత్ర్య హక్కును గుర్తించిన తర్వాత కాంగ్రెస్‌కోర్కె న్యాయమైనదని ఒప్పుకొనక తప్పదు. కాని ఇప్పుడు అందరము ప్రపంచ యుద్ధంలో మునిగియుండడంవలన ప్రజాపరిషత్తును సమావేశపరచడం అనువైనపనిగాదు. కాంగ్రెస్‌కూడ ఈ కష్టాన్ని గుర్తించినది. పూర్వం లాగా రాజప్రతినిధిచేతిలో కొన్ని ప్రత్యేక అధికారాలు వుంచబడకుండా, రాజప్రతినిధికి ప్రజాప్రతినిధుల కోర్కెలను త్రోసివుచ్చే 'వీటో' అధికారం లేకుండా తాత్కాలిక భారత జాతీయ ప్రభుత్వ నిర్మాణానికి కాంగ్రెస్ అంగీకరించినది. ఈ ప్రభుత్వంలో—తాత్కాలికమే అయినా—జాతీయ, అల్ప సంఖ్యాక, మితవాద, అస్పృశ్య, రైతువర్గాల ప్రతినిధుల జేర్చుకోడానికి కాంగ్రెస్ సిద్ధంగావుంది. కాని ఇట్టి తాత్కాలిక ప్రభుత్వంచేత సమస్త ప్రభుత్వాధికారం ఉండాలని కాంగ్రెస్ కోరిక. ఈ తాత్కాలిక ప్రభుత్వం ప్రస్తుతపు కేంద్రశాసన సభకు బాధ్యులై ఉండడానికిగూడా కాంగ్రెస్ ఇష్టపడినది. ఈ ప్రతిపాదన కాంగ్రెస్‌యొక్క మేధావిశేషమును,

స్వవిశ్వాసమును వెల్లడిచేయుచున్నది. ప్రస్తుతమున్న కేంద్రశాసనసభకు నూతన తాత్కాలిక జాతీయప్రభుత్వం బాధ్యతగలిగి యుంటుందని అంగీకరించడంవలన ఎట్టి ఆలస్యంలేకుండా వెంటనే జాతీయప్రభుత్వం నెలకొల్పబడడానికి అవకాశం కలుగుచున్నది. అందువలననే ఈ ప్రతిపాదన చాల తెలివైనదని ఒప్పుకొనక తప్పదు. ప్రస్తుతమున్న కేంద్రశాసన సభలో ప్రత్యేక నియోజక వర్గాల ప్రతినిధులు, ఉద్యోగులు, ఎన్నుకొనబడక ప్రభుత్వంచే నియోగింపబడిన సభ్యులు చాలమంది ఉన్నారు. తాత్కాలిక జాతీయ ప్రభుత్వం సాఫీగా సాగాలంటే ప్రస్తుత కేంద్ర శాసనసభలోని ఎన్నుకొనబడిన సభ్యులందరి ప్రోద్బలాన్ని కాంగ్రెస్ కలిగిఉండాలి. అట్టి షరతున కంగీకరించడంలో కాంగ్రెస్ తన ధైర్యాన్ని, ప్రజలయందు తనకుగల నమ్మకమును ప్రకటించినది.

కానున్న పరిష్కారం కేవలం భావిభారత రాజ్యాంగ విధానాన్ని విశదీకరించిన చాలదు. యుద్ధాన్ని నిర్విఘ్నంగా కొనసాగించడానికి బ్రిటిన్, అమెరికా, సోవియట్ యూనియన్, చైనాలతో ఇండియా ఏ పునాదులననుసరించి, ఎట్టి మార్గాల తోడ్పడుతుందో ఒక సంధిమూలంగా నిర్ణయం కావాలి. ఈ సంధిలో సైనిక నాయకత్వం, సైనిక సమీకరణ బాధ్యత, సైన్యాభివృద్ధి, సైనికసరఫరా, దేశంలోని సైనికోపకరణ ఉత్పత్తి మొదలైన సైనిక సహకార విషయాలన్నీ పూర్తిగా ఇమిడి ఉండాలి.

సైనిక సహకారం విషయంలోనూ, రాజకీయపరిష్కారం విషయంలోనూ కానున్న పరిష్కారం స్థిరపునాదులపైన, ఘట్టి పునాదులపైననే స్థాపింపబడునని మనం నమ్మవచ్చు. భారత స్వాతంత్ర్యాన్ని బ్రిటన్ గుర్తించడం న్యాయం. చారిత్రాత్మకంగా తప్పనిసరియైన పరిణామం. పైగా స్వాతంత్ర్యాన్ని గుర్తించడం ఇండియా, బ్రిటన్లకు

రెంటికీ లాభదాయకం. భారత, బ్రిటిష్ ప్రజలందరూ, అన్నిటికన్న మిన్నగా, ఫాసీజం వినాశనాన్నే కాంక్షిస్తున్నారు ; చైనా స్వాతంత్ర్యాన్ని కోరుచున్నారు ; జపాన్ ఆసియా ఖండాన్ని తన పాదాలక్రింద అణచి ఉంచి నాశనంచేయకుండా చూడాలని అభిలషిస్తున్నారు. బ్రిటిష్, భారత ప్రజలు ఏకమై తమకుగల సర్వశక్తులనూ సమీకరించి ఏకోన్ముఖంగా ఉపయోగించినగాని జపాన్‌ను ఓడించలేమని, ఫాసీజాన్ని నిర్మూలించను సాగే ఈ యుద్ధంలో సాయపడలేమని వారెరుగుదురు. కేవలం ఒక న్యాయమైన హక్కును ఎట్టకేలకు గుర్తించడంకంటే, ఇంతవరకు చేసిన ఆలస్యానికి పశ్చాత్తాపపడడానికన్నా, ఏదో తాత్కాలిక ఉత్సాహానికన్నా హెచ్చుగా ఇంగ్లండు భారతదేశాలమధ్య ఇప్పుడు ఏర్పడే మైత్రి గట్టి పునాదులపై నిర్మింపబడును.

---

# 8. తుది పలుకు

పైనిక లాభాలు, సౌకర్యాలు అలావుంచి భారత ప్రతిష్టంబన పరిష్కారంవల్ల భారత ప్రజలకు కలిగేటంత లాభం బ్రిటిష్ ప్రజలకుగూడా కలుగుతుంది. బ్రిటన్‌లోని అభివృద్ధినిరోధకులు "ఇండియాను పోగొట్టుకొనుచున్నాం" అంటున్నారు. ఇప్పటి పరిస్థితులలో "ఇండియాను పోగొట్టుకొనుట" తప్పదు. పాతరకపు సామ్రాజ్యవాదం రోజులు తీరినవి. మునుపటి సామ్రాజ్యవాదం నాశనం చేయబడినది. కొన్నిచోట్ల పాత సామ్రాజ్యవాదం ఆత్మహత్య చేసుకున్నది. అందువలన ఇండియాపై

తాను చెలాయించుచున్న అధికారాన్ని * ఇంగ్లండు తనంతట తాను వదలుకోవడం మంచిది. అప్పుడు ఇండియా ఇంగ్లండుకు మిత్రరాజ్యంగా, స్నేహితుడుగా నుండగలదు. లేకున్న ఇంగ్లండు ఇండియాలోని తన సర్వస్వాన్ని జపానుకో, ఇండియాకో అర్పించుకొనక తప్పదు.

మనం కేవలం మన నష్టాలనే లెక్కించుకుంటూ కూర్చోనక్కర లేదు. భారత స్వాతంత్ర్యఫలితంగా మనకు సమకూరే లాభాలు ఎన్నో ఉన్నాయి. భారతదేశాన్ని స్వాతంత్ర్య మనుభవింపనిచ్చామంటే, మనం స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్యంకొఱకు యీ యుద్ధంలో పాల్గొంటున్నామని చెప్పుకోడానికి వీలుంది. పైగా కూటికి, బట్టకు లేక మలమల మాడే కోటానుకోట్ల ప్రజల దోపిడిలో భాగస్వాములమన్న అవినీతిని మాన్పుకో గలుగుదుము. తటస్థదేశాలయొక్క, అమెరికాయొక్క ఆమోదాన్ని మరల పొందగలుగుదుము. మనం భారతదేశాన్ని మనకు బానిసదేశంగా పాటిం చడంవలన—పరిపాలించడంవలన అమెరికాలోనూ, తటస్థరాజ్యాల్లోనూ మనం చెడ్డవారమని ఎంతో అభిప్రాయం ఏర్పడియున్నది. మన ప్రభుత్వం పత్రికలపై విధించిన నిర్బంధములవలన ఈ అభిప్రాయపరిమితిని మన మెరుగకయున్నాము. భారతదేశ స్వాతంత్ర్య ప్రకటనవలన అట్టి అభి ప్రాయం మనకు లాభసాటిగా మారగలదు. ప్రస్తుతం ఇండియాలో మన ప్రభుత్వ విధానాన్ని జర్మనుప్రజలకెత్తిచూపి మనలను రాక్షసులుగా గోయ బుల్స్ చిత్రిస్తున్నాడు. ఆతనికున్న ఆయుధాలన్నిటిలోకీ మనపై నుప యోగించను ఈ దుష్ప్రచారమే ఉత్తమోత్తమమైన ఆయుధముగానున్నది. ఫాసీజాన్ని బలహీనపరచను మనం జర్మను ప్రజలకు మన ప్రచారం మూలంగా హిట్లరుమువాకన్నా మనం ఉత్తములమని చెప్పుకుంటున్నాం.

---

* దురధికారాన్ని అంటే బాగుండేది

జర్మన్ ప్రజలు గోయబుల్స్ చిత్రించినట్లు మన ఇండియా పరిపాలనను గురించి విన్నతర్వాత, మన ప్రచారాన్ని నమ్మతారా?

కాస్త దూరదృష్టితో చూచిన, చైనా ప్రజలు ఇన్నేండ్లు మొండి పట్టుదలతో ఎందువలన పోరాడగలిగారో యోచించిన, సోవియట్ రష్యా ఆసియా ఖండంలోని తన ప్రజలను, దేశాలను ఎలా సర్వతోముఖంగా అభివృద్ధిపరచినదీ గమనించిన, భారత, చైనా, సోవియట్ ప్రజలకు మున్ముందు సౌఖ్యాభివృద్ధులకు అపరిమిత అవకాశాలున్నవని గ్రహింపగల్గుదుము. జపాన్ ప్రజలు తమ ఫాసిస్టు ప్రభుత్వాన్ని పూర్తిగా నిర్మూలించగలిగిన వారుగూడా ఇతర ఆసియా ప్రజలతోబాటు, అత్యంత సౌఖ్యాన్ని, అభివృద్ధిని అనుభవించగలుదురు. ఇట్టి మహత్తర అవకాశాలను మనం గమనించి, ఈ అవకాశాల ఫలితంగా ఆసియా, యిరోపా, బ్రిటన్‌లకు—ఒక దేశమేమిటి, ప్రపంచమంతటికీ—శాంతి, అభివృద్ధులనేపాటి చేకూర్చునని ఊహించుకోవాలి. ప్రస్తుతం క్రిప్సు రాయబారంగతి ఏమైనా, బ్రిటిష్, భారతప్రజలమధ్య సమాన ప్రతిపత్తిని—బలవంతం మీదగాక—సఖ్యత, స్నేహం శాశ్వతంగా ఏర్పడడానికి మనం పాటుపడాలి. అట్టి సఖ్యత ఏర్పడిన మన రెండుదేశాల ప్రజలకేగాక మానవజాతికంతకు తద్వారా ఎంతో మేలు కలుగగలదు.

# అనుబంధము

## భారతీయ నాయకులతో జరిగిన చర్చల సారాంశ ప్రకటన.

(29-3-1942 న ప్రకటింపబడిన సమాచార మంత్రివర్గ ప్రకటన ననుసరించి.)

బ్రిటిష్ యుద్ధమంత్రి వర్గంవారు తీర్మానించిన ప్రతిపాదనలు ఈదిగువ విశదీకరింపబడినవి. ఈప్రతిపాదనలనే భారతీయనాయకులతో చర్చించడానికి సర్ స్టాఫర్డ్ క్రిప్సు ఇండియాకు వెళ్ళారు. ఈ ప్రతిపాదనలను అమలు పరచడమా అన్న ప్రశ్న ప్రస్తుతం న్యూఢిల్లీలో క్రిప్సుకును, భారతీయ నాయకులకును జరుగుచున్న చర్చలపైననే ఆధారపడి వుంటుంది.

ఇండియా భావిరాజ్యాంగ విధానం విషయమై చేయబడిన వాగ్దానాల సఫలతమగురించి ఈ దేశంలోనూ, ఇండియాలోనూగూడా అనుమానాలు, ఆతుర్దా ప్రకటిత మౌతున్నవి. అందువలన బ్రిటిష్ ప్రభుత్వం, ఇండియాలో అతి శీఘ్రకాలంలో స్వపరిపాలనను స్థాపించను ఎట్టి చర్యలు తీసుకొనదలచినది విశదంగా, విస్పష్టంగా ప్రకటింప నిశ్చయించినది. బ్రిటిష్ ప్రభుత్వ ఆశయం నూతన ఇండియా యూనియన్‌ను సృష్టించడం. అట్టి యూనియన్ అధినివేశ ప్రతిపత్తిగల రాజ్యంగా నుంటుంది. ఈ అధినివేశరాజ్యం బ్రిటన్‌తో, తదితర అధినివేశ రాజ్యాలతో, చక్రవర్తి పట్లగల రాజభక్తిద్వారా, సంబంధంకలిగి ఉంటుంది. ఈ నూతన ఇండియా అధినివేశరాజ్యం ఇతర అధినివేశరాజ్యాలతో అన్నివిధాల సమాన ప్రతిపత్తి కలిగి ఉంటుంది. విదేశ వ్యవహారాల్లోగాని, స్వదేశవిషయాల్లోగాని ఏవిధంగాను ఈ నూతనరాజ్యం ఎవరికిని లొంగియుండదు.

అందువలన బ్రిటిష్ ప్రభుత్వం ఈ క్రింది ప్రకటనను చేస్తున్నది.

(1) యుద్ధం ముగిసిన వెంటనే, ఈ దిగువ వివరింపబడిన విధంగా, ఇండియాలో నూతన నిర్మాణ చట్టాన్ని సృష్టించను, ఎన్నుకొనబడిన ప్రతినిధిసభ నొకదానిని ఏర్పరచను తగు ప్రయత్నములు చేయబడును.

(2) ఈ నిర్మాణ చట్టాన్ని సృష్టించే సంస్థలో, స్వదేశసంస్థానాలు పాల్గొనడానికి, దిగువ వివరింపబడినట్లు, అవకాశము గల్గించబడును.

(3) అట్టి సంస్థచే సృష్టించబడిన నిర్మాణచట్టాన్ని బ్రిటిష్ ప్రభుత్వం అంగీకరించి, వెంటనే అమలుపరచ ప్రయత్నిస్తుంది. కాని అందుకు ఈ దిగువ షరతులున్నవి—

(అ) బ్రిటిష్ ఇండియాలో ప్రస్తుత రాష్ట్రాలతో నేదికాని నూతన నిర్మాణ చట్టాన్ని అంగీకరింపకున్న ప్రస్తుత పరిపాలనా విధానమే ఆ రాష్ట్రంలో సాగగలదు. కాని కొంతకాలమైనతర్వాత మరల అట్టిరాష్ట్రం నూతన ఇండియా అధినివేశ రాజ్యంలో చేరడానికి అవకాశాలుంటవి.

అట్లు నూతన ఇండియా అధినివేశరాజ్యంలో చేరని రాష్ట్రాలు కొన్ని చేరి మరొక అధినివేశరాజ్యాన్ని ఏర్పరచ ప్రయత్నిస్తే బ్రిటిష్‌ప్రభుత్వం ఆ రాజ్యానికికూడా ఇండియన్ సంయుక్తరాజ్యానికి ఇచ్చినప్రతిపత్తినే ఇస్తుంది.

(ఆ) నిర్మాణ చట్టాన్ని ఏర్పరచే సంస్థకు (ప్రజాపరిషత్తు) బ్రిటిష ప్రభుత్వానికి ఒక సంధి కుదరాలి. ఈ సంధిలో బ్రిటిష్‌వారినుండి అధికారాన్ని భారతీయుల పరం చేయడానికి అవసరమైన అంశాలన్నీ ఇమిడి ఉంటవి. ఈ సంధిలో, బ్రిటిష్ ప్రభుత్వం చేసిన వాగ్దానాల ననుసరించి, మత అల్ప సంఖ్యాకుల రక్షణకు, ప్రత్యేక తెగల రక్షణకు అవసరమైన షరతు లుంటవి. కాని ఈ సంధి ఇండియన్ యూనియన్ బ్రిటిషు కామన్వెల్తు లోని ఇతర దేశాలతో తనకుగల భావి సంబంధాలను తీర్మానించే హక్కులనుగురించి కట్టు దిట్టములు చేయదు.

స్వదేశ సంస్థానం ఏదిగాని నూతన ఇండియా యూనియన్‌తో చేరడం అన్న విషయంతో నిమిత్తంలేకుండా స్వదేశ సంస్థానాలతోగల సంధులు, నూతన పరిస్థితుల ననుసరించి, పునరుద్ఘాటింప బడవలెను.

(4) యుద్ధం ముగిసేలోపల భారతనాయకులు నూతన నిర్మాణ చట్టాన్ని ఏర్పాటుచేయను ఏవిధంగా ఒక సంస్థను ఏర్పరచడం అని తీర్మానించిన సరే. లేకున్న నిర్మాణచట్టాన్ని ఏర్పాటుచేసే సంస్థ యీ క్రింది విధంగా ఏర్పరచబడును.

యుద్ధం ముగియగానే రాష్ట్రాల్లో ఎన్నికలు జరుగును. ఈ ఎన్నికల ఫలితాలు విశదంకాగానే రాష్ట్రశాసన సభలలోని అసెంబ్లీలు సమావేశమై ఒక్కొక్క రాష్ట్రానికి ఇంతమంది అన్న లెక్కనుగాక, ఇంతమంది సభ్యులకు ఇంతమంది ప్రతినిధులన్న లెక్కను సభ్యుల నెన్నుకుంటారు ఈ సభ్యులే ప్రజాపరిషత్తు సభ్యులౌతారు. ఈ సభ్యులసంఖ్య అన్నిరాష్ట్రాలలోని అసెంబ్లీ సభ్యులలో పదియవపాలుంటుంది.

బ్రిటిష్ ఇండియా మొత్తానికి ఎన్నుకొనబడిన ప్రతినిధుల సంఖ్య ననుసరించి స్వదేశసంస్థానాలు తమజనాభాను బట్టి ప్రతినిధులను నియమించగలవు. ఈ సభ్యులు ప్రజలచే ఎన్నుకొనబడక సంస్థానాధీశులచే నియమింపబడినా వీరికి బ్రిటిష్ ఇండియానుంచి ఎన్నుకొనబడిన సభ్యులకు గల హక్కులే ఉంటవి.

(5) ప్రస్తుతం భారతదేశం అతి క్లిష్టస్థితిలో నున్నది. నూతన నిర్మాణ చట్టం ఏర్పాటుకావడానికి కొంతకాలం పడుతుంది. సహజంగా ఈ మధ్యకాలంలో ఇండియా రక్షణను, ప్రపంచయుద్ధ నిర్వహణలో నొక భాగంగా, బ్రిటిష్ ప్రభుత్వమే నిర్వహించాలి. కాని సైనికంగా, నైతికంగా, మిగతా అన్నివిధాల ఇండియాను పూర్తిగా సమీకరించవలసిన బాధ్యత ఇండియా ప్రభుత్వందే. ఇండియా ప్రభుత్వం భారతీయుల సహకారంతో ఈ పనిని నెరవేర్చగలదు. అందువలన భారతీయ ప్రజానాయకులందరూ తమదేశ విషయాల్లో, బ్రిటిష్ కామన్వెల్తు సంస్థలలో, మిత్రరాజ్యాలు ఏర్పాటుచేసిన సంస్థలలో పాల్గొని యుద్ధ నిర్వహణకు తోడ్పడమని బ్రిటిష్ ప్రభుత్వం కోరుచున్నది. అందుకు భారతనాయకులను ఆహ్వానించుచున్నది. భావి భారత స్వాతంత్ర్యానికి అత్యవసరమైన, ముఖ్యమైన ప్రాతిపదిక ఈ యుద్ధంలో మిత్రమండలివారి గెలుపే. అందుకు భారతీయులు పూర్తి సాయాన్ని ఇచ్చి, యీ కార్యాన్ని సఫలీకృతంచేయగల అవకాశం వారికిప్పుడు లభించింది.

# మా ప్రచురణలు

| | | | |
|---|---|---|---|
| 1. | సోవియట్ల దేశం * | .... | 0—8—0 |
| 2. | ఫ్రాన్స్ పతనం * | .... | 0—8—0 |
| 3. | నేటి జపాన్ * | .... | 0—8—0 |
| 4. | సోవియట్ రష్యా | .... | 0—12—0 |
| 5. | చైనాలో నూతన జీవితోద్యమం | .... | 0—4—0 |
| 6. | బోల్షివిజం | .... | 0—4—0 |
| 7. | పాకిస్థాన్ | .... | 0—4—0 |
| 8. | సోవియట్ సంయుక్తరాష్ట్రం — మనమిత్రరాజ్యం | | 0—8—0 |
| 9. | ప్రపంచ ఆర్థిక దుస్థితి | .... | 0—4—0 |
| 10. | సోవియట్లదేశం (రెండవభాగం) | .... | 0—10—0 |
| 11. | నేటి చైనా | .... | 0—10—0 |
| 12. | ప్రజాయుద్ధం | .... | 0—6—0 |
| 13. | యుద్ధకాలపు చైనా | .... | 0—4—0 |
| 14. | సోవియట్ రష్యాలో | .... | 0—8—0 |
| 15. | లెనిన్ | .... | 0—8—0 |
| 16. | గాంధీజీ * | .... | 0—8—0 |
| 17. | హిందూపద్ పాదుషాహి | .... | 2—8—0 |
| 18. | డాక్టర్ కొట్నిస్ (మార్చిలో వెలువడును) | .... | |
| 19. | ఇండియా స్వాతంత్ర్య సమస్య | .... | 0—8—0 |

* ప్రతులు లేవు. ....

## త్వరలో వెలువడనున్నవి

1. కుమార్తెకు లేఖలు (నెహ్రూ)
2. గాంధీజీ (రెండవ భాగం)
3. ప్రపంచ చరిత్ర (నెహ్రూ)
4. హిందూపద్ పాదషాహి (రెండవ భాగం)

# మా నూతన ప్రచురణ

## హిందూపద్ పాదుషాహి

పుటలు 240. వెల రూ. 2—8—0

విషయం: మహారాష్ట్ర హిందూసామ్రాజ్య సమీక్ష
రచన : వినాయక దామోదర సావర్కార్.
అనువాదం: మరుపూరు కోదండరామరెడ్డి.

"సావర్కార్‌గారు రచించిన ఆంగ్లగ్రంథము ఉద్రేక పూరితము........ ఈ అనువాదము చక్కని శైలిలో సమర్థులగువారిచే వ్రాయబడినది. నిర్దుష్టమగు భాష కలదు. సరియైన భాషాంతరీకరణము. ఇందలి విషయము ప్రతి హిందువున్నూ మహోల్లాసముతో చదివి గుణపాఠము నేర్చుకోదగినది.........అందరూ తప్పక చదివి లాభంపొంద దగిన సరియగు చారిత్రక గ్రంథమిది."

—గోలకొండ పత్రిక, 4-6-45

"హాలికుని రచనలు చదివిచూచినవారికి వేరుగ చెప్పనవసరంలేదు. అదిగాక ప్రస్తుత సమీక్షాంశమగు గ్రంథరాజం మహత్తర చారిత్రక ప్రాముఖ్యంగలది. మహావీరుడు రచించింది. ఒక విద్వన్మణి అనువదించింది—మరి ఈ సరస్వతీ ప్రకటన అవశ్యం ప్రతిగేహాన్నీ అలంకరించి కలసిందనడంలో మాపట్ల అత్యుక్తి అణుమాత్రం లేదనుకుంటాము. గ్రంథస్థ విషయం హిందూరాజ్య రమ శివాజీ అనంతరం మహారాష్ట్రధ్వజం క్రింద మహారాష్ట్రాధికార యుక్తంగా శోభించిన నాటిరోజుల వర్ణన...."

జమీన్‌రైతు 22-6-45

"ఇందు హిందూమహాయుగ చరిత్ర ఒక నూతన దృక్పథంలో చిత్రమైనది...."

ప్రజామిత్ర 24-6-45

# నవ్యసాహిత్యమాల

## అనంతపురం

అనంతపురం నవ్యసాహిత్యమాలవారు మమ్ము వారి సోల్ ఏజంట్సుగా నియమించారు. వారి ప్రచురణలు మావద్ద తప్ప మరెచ్చట దొరకవు. షరతులు మా ప్రచురణలకువలెనే. ఈ దిగువ ప్రచురణలుమాత్రమే ప్రస్తుతం కలవు.

| | | |
|---|---|---|
| 1. | సమీక్ష | 0—10—0 |
| 2. | రాతలు గీతలు | 0—6—0 |
| 3. | కోల్ఖోజ్ | 0—4—0 |
| 4. | చెకోవ్ కథలు | 0—8—0 |
| 5. | దురాక్రమణ | 1—4—0 |
| 6. | కామ్రేడ్ స్టాలిన్ | 0—6—0 |
| 7. | అది రష్యా | 0—4—0 |

---

వివరములకు :

## సంస్కృతి గ్రంథమండలి

వంగల్ బిల్డింగ్స్ :: పెరంబూరు పోస్టు

మదరాసు

---

Printed by Q. H. No. M. S. 311. Vinodan Press, 33, Jones Street, for Q. H. No. M. S. 19 Culture Book Club, Perambur.—1000 copies (16-1-1946)

మూలధనం

యుద్ధకాలంలోనూ—శాంతిసమయంలోనూ

అవసరమైనవి—అమూల్యమైనవి

# వజ్రములే

మూలస్థానం

# సురాజ్ మల్స్

నాణ్యమునకు—నమ్మకమునకు

గతయాభై యేండ్లుగా

పేరుప్రఖ్యాతులు గాంచినవి—

# సురాజ్ మల్స్ వజ్రములే

**318, ఎస్ప్లనేడ్, మద్రాసు.**

Printed by Vinodan Press, 33, Jones Street,
Q. H. No. M. S. *311*, for Culture Book Club, Perambur
Q. H. No. M. S. 19—1000 copies (*16-1-1946*)